## బిరుదగద్యము.

జయజయ, స్వస్తి, సమధిగత పంచమహాశబ్ద, మహామండలేశ్వర, కల్యాణపుర
వరాధీశ్వర, ఆత్రేయసగోత్ర, క్షత్రియాచారకులపవిత్ర, చాళుక్యనారాయణ,
చాళుక్యచక్రవర్తి, మండలీకరధరణీవరాహ, వెంగత్రిభువనిమల్ల, పాయకాభుజు
పయిలేజాజ్జారుబొల్లితే జొల్లియాన్, సాములామణివిలె మణివియాన్, సాములా
జక్కిడీవరాజాయతెక్కిడీలు మన్నియాన్, సాములాతాకు ఉత్సాయి బావాలు అల
వితోమన్నియాన్, సాములాజాళుకాళుపడుకాయితే మన్నియాన్, సాములాయ
బాలుతలెసలితె మన్నియాన్, సాములాబయిత్సానైత్సాతవిసాపాణవితే మన్ని
యాన్, సాములాకాలేభిడిపాడ్రిపాతుకాయీతు మన్నియాన్, సాములాభర్త
రూదిగుడాపంజకాళాఘోరాసాళాబాహులత్తువర్స మన్నియాన్, సాములాసామోరు
దావతే సప్పసాళు తేభాగియాతే ముత్తిశియోసరితే మన్నియాన్, సాములాపోడు
ఊరగలాశి ఉపరిదేఖుతేమన్నియాన్, సాధర్తారు, శ్రీరాజ, రాజపరమేశ్వర, శ్రీ
రాజరాజేశ్వరదివ్యశ్రీపాదపద్మారాధకాది మహాబిరుదాపదానోజ్జ్వల, కల్యాణబిజ్జ
ళేశ్వర, విజయీభవ, దిగ్విజయీభవ. 168

తే. అని పొగడ్తకు నెక్కెఁ గల్యాణబిజ్జ, లక్షితీశుఁడౌ రాజులలాము నతని
మనుమఁడైనట్టి వీరహొమ్మాళిరాయఁ, డవనిఁ బాలించె సకలజనాళి మెచ్చ. 169

క. కలనైన నలజడని యెడి, పలుకాభూవరుఁడు జనులు పలుకక యుండన్
విలుకోఁపు నఁగావించెను, బలశౌర్యములఖిలనృపులు ప్రణుతియొనర్పన్. 170

వ. ఆవీరహొమ్మాళిరాయమహీపాలుం డొక్కనాఁడు నూఱు వేలరథంబులు లక్షయేనుం
గులన్నిగుఱ్ఱంబులు శతసహస్రాయుతపదాతివర్గంబును గొలిచిరా, జయదుందుభిస్వన
ప్రకుపితాచలకందరకంఠీరవుండై, సర్వాలంకృతాభిరామంబై సకలసంపదలకునికి
పట్టై పరమభాగవతజనాకీర్ణంబై పరాశ్చర్యంబై వీరనారాయణదేవనివాసంబై యొ
ప్పుగంగాపురాఖ్యకుఁ బ్రతినామంబగు మాయాపురంబునకరుగుదెంచి, పౌరులెదు
రుకొన రాజగృహంబుం బ్రవేశించి యుచితకరణీయంబులొనరించి యారాత్రిసుఖ
నిద్రఁజెంది, మఱునాఁడరుణోదయంబున స్నానసంధ్యాద్యనుష్ఠానంబులొనర్చి,
మున్ను తనచేఁ బ్రతిష్ఠచేయఁబడిన చెన్నకేశవస్వామి దేవాలయంబునకరిగి యాదేవునకు
సద్భక్తినురంబున నున్న పదకమణులు చ్యుతిగాఁ గరయుగంబునఁ గర్ణయుగళంబు
మూసికొని ప్రవరాన్వితసగోత్రనామసహితసాష్టాంగనమస్కారంబులాచరించి,
తత్ప్రసాదంబు మాళినిడి యాహార్తుకాదారభ్య సాయంసమయావధి దేవాలయంబు

ప్రదక్షిణంబుఁ గావింతునని విద్వజ్జనసమక్షంబున సంకల్పంబుఁ గావించి, చెన్న
కేశవస్వామిదివ్యశ్రీపాదపద్మంబులు నిండుడెందంబను నరవిందమధ్యంబునం బొందు
పఱిచి, మందమందగమనమున శ్రీహరిసహస్రనామంబులు చర్చించుచుఁ బెద్దలగు బ్రా
హ్మణులు వెంట రాఁ దన్మార్గంబునఁ దనుక్లేశంబు సకోర్చి ప్రదక్షిణంబొనరించు నెడఁ
బ్రదక్షిణప్రదక్షిణంబునకు గరుడస్తంభోపకంఠభూమి నుదురంట సాష్టాంగదం
డప్రణామంబొనర్చుచుఁ దక్షిణంబుడుగక ప్రదక్షిణనమస్కారంబు సేయుచు,
సాయంకాలసమయంబునం బ్రదక్షిణంబొనర్చి గరుడస్తంభంబుచెంత నిలిచి
బ్రాహ్మణజనంబు లిరుఁకెలంకులఁ దొలంగ సాష్టాంగదండనమస్కారం బొనర్చుచు
నచ్చో శంఖచక్రముద్రితస్థాపితోపసంఘర్షణోపలక్షితశంఖచక్రలాంఛిత భుజ
యుగళుండైన నిరీక్షించి విద్వజ్జనంబులు పౌరులు బంధువులు మంత్రిసామంతపరి
వారనికరంబును విస్మయంబంది యితనిచరితంబు దివ్యంబని పలుదెఱంగులం గొని
యాడిరంత నాపినపాతిమ్మళిరాయమహామండలాఖండలుండు నిజపురంబునకరుగు
దెంచి వీరనారాయణదేవచరణాంభోరుహారాధనానుసంప్రాపిత సకలసామ్రాజ్య
విశేషభోగంబులుం బరమభాగవతజనసఖిత్వంబునుం గల్గి పెద్దకాలంబు ధాత్రిఁ
బాలించుచుండె. 171

తే. ఆమహారాజునకు సుతుఁడైన తాత, పిన్నమమహీశ్వరేశుఁడు పృథివి నేలె
రంతిహైహయనహుషసగరనృగపూరు, భరతరఘుశిబిరుకుమహీవరులఁ బోలి. 172

క. ఆతాతపిన్ననృపవరుఁ, డాంతతభుజవిక్రమమున నహితోర్వీశ
వ్రాతముల గెలిచి ధర వి, ఖ్యాతగఁ దక్షిణ మొసంగి క్రతువులఁ జేసెన్. 173

## బిరుదగద్యము.

స్వస్తి, సమస్తసద్గుణాభిరామ, చంద్రరాజాన్వయాబ్ధిసోమ, నిస్తులౌదార్యనిరా
కృతసూర్యనందన, వైరిభూపాలాభినందన, సమస్తసురాచారవెలుకురాచనా
యకరాజసప్తాంగహరణ, నవదిగంతరాగతనరపతినికరమకుటమణిఘృణివిరాజితచరణ,
శరణాగతసంరక్షక, మన్నెపులిబిరుద, మహామండలాధిపతిశిక్షకశాసన, వైరిపాకశాసన,
వీరమహామ్మళిరాయతనూజ, తాతపిన్నరాజ, జయ, విజయీభవ. 174

వ. అని యారాజేంద్రుండు వందిజనవందితుండగు. 1;5

ఆ. తాతపిన్ననృపసుధాధామవరకీర్తి, చన్ద్రికాభిరామసరణి యమరుఁ
గాశిసేతుమధ్యకటకవనీపక, జనచకోరములకు సమ్మదముగ. 116

ఆ. తాతపిన్నరాట్ప్రతాపంబు మిక్కిలి నిండి పర్వఁగమలజాండమలర

విజయజలజనయన వేడ్కఁ జేఁగైకొన్న, కుంకుమంపుబరణికొమరునమరి. 177

చ. అతనికి సోమదేవవసుధాధిపుఁ డుద్భవమందె నిర్జితా
హితుఁడయి తాల్చె భూభరమహీనపరాక్రమరేఖ నెన్నఁగా
క్షితిధరజామనోహరునికిం బ్రతియౌచును నీతిచే బృహ
స్పతిసరిఁ బోలి ధర్మమునఁ బాండుసుతాగ్రజుజోడుకోడరై. 178

క. సకలజనంబులు సిరులం, దొకటనునచ్చికములేకనుండఁ బెనుచుచుం
బ్రకటముగ ధనము విప్రతతికి నిడి సవనములు సోమదేవుఁ డొనర్చెన్. 179

సీ. బలవంతుఁడగునడబాలనాయకునిని ఘోరుఁడౌ గుజ్జువీరనేని
కాద్రవసోన్నిద్రరుద్రపాధిపు మహాశౌర్యగౌరాగడ్డి సాహసాంకు
గంగినాయకుని సంగ్రామరంగంబున సింగంబు మత్తమతంగజములఁ
బట్టుకైవడిఁ బట్టి చట్టలెత్తించి కిన్కనునసహుండునై గంగినేని
తే కొండప్రాగ్ద్వారసీమనుద్దండవృత్తిఁ, గంబములఁ బోఁత తోరణగాఁగఁ గట్టి
వినుతికెక్కెను సకలభూజనులచేత, సోమదేవనృపాలసుత్రాముఁ డెలమి. 180

సీ. కదనరంగంబునఁ గరితురంగమవీరవితతితోఁ బాదుమాలు విఱుగఁ దోలి
యమితోగ్రశౌర్యమహత్త్వుఁ బట్టి నిచ్చెరుఁ జుట్టదనుగుమారునకది
గాక ఘనతాప్రదకమలంబు నదురంట దండంబుఁ గొట్టిదఁ దన్నుఁ గాచి
విడువుమన్నను గాచి విడిచియర్థులకును సప్తిశతంబునశ్వములవాని
తే. చేతనిప్పించి శరణన్నఁ బ్రీతిఁ గాచు, బిరుదు తగునె తనికెయని ధరణిపతులు
సన్నుతింపఁగ నాదిరాజన్యచర్యఁ, జెజరలె సోమదేవధాత్రీవరుండు. 181

సీ. దండెత్తి చని మహోద్దండవృత్తిని గంగినేనికొండవలీఁగానుగట్టి
కందనవోలునుగలువకొలనుగోటరాచూరు నెఱసంటిరాజ్యకైన
సాధింపరాని మొసలిమడుగు మఱియాతగిరినగరము సాతానికోట
వరుసతో సాధించి పరమహర్షంబునఁ దత్తన్మహాజనతతులఁ బ్రోచి
తే. ధరకుఁ బోడవని వినుతింపఁదగినయట్టి, యారవీటిపురాధ్యక్షుఁ డగుచుఁ దాను
పిన్నృపసోమదేవుండయ్యె నన్నదగిరెయె, నఖిలసత్కవిసురభూజమనుచు నెప్పుడు 182

## బిరుదగద్యము.

జయజయ, నిఖిలమహాభాగనతముఖ్యవిఖ్యాతకీర్తి, ఏకదివసఘటికైకధాటీహాతాప్తకోటరాచూరు సాతానికోట కందనవోలు యాతగిరి కలువకొల్లు మొసలిమడుగు గంగినేనికొండాభిధానసప్తదుర్గప్రవర్తి స్థూదుర్గ జలదుర్గ గిరిదుర్గ వనదుర్గ

ఘారాశిదుర్గ ఖిఘాళ, సముద్ఘుష్యమాణబిరుదాపదాన హాళహాళికాకర్ణనపులకితక
పోల, నాకులపాటిముదుగంట్యానెగొందికుంతిసరవిజయలక్ష్మీసమక్షీకరణలక్షిత,
నాకులపాటివీరక్షేత్రభారతీమల్ల ముదుగంటివీరక్షేత్రభారతీమల్ల ఆనెగొందివీర
క్షేత్రభారతీమల్ల కుంతివీరక్షేత్రభారతీమల్ల వీరక్షేత్రభారతీమల్ల బిరుదభరితాను
భావ, స్వభావగంభీరాంభోనిధి, సత్యగుణవాసుదేవ, సకలనరదేవచూడామణి, అసి
భరణపటిమసహదేవ, ఆదిదేవ, సుపర్వరమణీమణిస్తుత, వరద, భయద, హోసబిరు
దరగండ, వీరప్రతాపబిరుద, బిరుదుమన్నెరగండ, పరిగొలసురత్రాణ, శరణాగత
త్రాణబిరుద, రాయరంగభీభత్స, రాయరాహుత్తరగండ, దైవరగండ, గండర
గండ, తాతపిన్నమరాజతనూజ, సోమదేవరాజ, విజయీాభవ, దిగ్విజయీాభవ. 183

వ. అని బిరుదులఁబొగడ మహీతలంబుఁబాలించె. 184

మ. హరిశౌర్యుండగుసోమదేవవసుధాధ్యక్షుసత్కీర్తి భా
సురతన్వద్దెసలెల్లనిండి తగఁబొల్చున్ భూజనస్తుత్యమై
హారమందారపటీరహీరకలశాబ్జాహిరాట్స్ఫారదా
శరదభ్రాంబుజగర్భసూనుబలభిత్సూనుకీర్తివారింపుచున్. 185

ఉ. ఇమ్మహి సోమదేవమనుజేంద్రుప్రతాపము నిండి దిక్కులన్
బమ్మినఁజాతపోతనవపల్లవబింబఫలారుణాంబుజా
తమ్ములటంచుఁగోకిలకదంబము కీరచయంబు వంచనీ
కమ్ములుగ్రమ్ముచుండునొడికంబుగ భ్రాంతివహించి పల్మరున్. 186

తే. సోమకులదీపకుండగుసోమదేవ, రాజవరునకునుదయించి రాఘవేంద్రుఁ
డఖిలనృపతులు ముకుళితహస్తులగుచుఁ, గొలువ ధరయేలెనతఁడు దోర్బలము మెఱసి.

సీ. ఎదిరించువైరులమదమడంపను శరణానినను రక్షింపనతఁడె నేర్చు
భావింప జనులకు భయముఁబుట్టింపనాహ్లాదమునొనరింపనతఁడె నేర్చుఁ
బరమధర్మమ్ముదప్పక నడవను జనతతిచేత నడపింపనతఁడె నేర్చుఁ
గమనీయనీతిమార్గముదెలివిగఁదెలియను దానుదెల్పనునతఁడె నేర్చు

తే. నార్యజనులనుబోషింపనతఁడె నేర్చుఁ, గానియొరులందునీనేర్పు గానుపింప
దనుచు సకలజనంబులు వినుతిసేయ, వెలసెనెంతయు రాఘవోర్వీభుజుండు. 188

## బిరుదగద్యము.

జయజయ, స్వస్తి, నిస్తులప్రతాపతపనోదయనిరస్తపరిపంథిసామంతాంధకా
రాంధకార, వసుంధరాభారభరణధురంధర, సీమంతినీజనమందహాస చంద్రికా

వికాస, అనన్యసామాన్యసకలగుణనివాస, యవనబలమర్దనోత్సాహ, తుళువబలసంహారవిహార, శబరకులబలనిహననవినోద, వాసుదేవచరణకమలసేవాసక్తచిత్త, శరణాగతవజ్రపంజర, వీరవ్రతశీల, కవికులసరసకవితాకర్ణనకర్ణాభరణ, మహాదానకంకణమణికంకణ, ఉత్సాహసహాయ, శౌర్యసామ్రాజ్య, సోమదేవరాజతనూజ, రాఘవరాజ, విజయరాఘవ, దిగ్విజయరాఘవ. 189

వ. అని కవిభటానీకంబులు పొగడ, రాఘవమహీపాలుండు ధర్మంబున రాజ్యంబేలె.

సీ. జహ్నుతనూభవ జడగతినడుగక కడునడిఁబఱచి సాగరముఁజేరెఁ
గల్పద్రుమములైదు కంపించి శాఖోపశాఖలు మిగులనాశలుఁబాఱె
భుజగేశుఁడెంతేని బుసచేత ముకలుమలకలుగా రసాతలముఁదూఱె
సురధేనువొకపడిఁబఱపున వనిఁజేరి పూరినిఁగరిచెను సారెసారె

తే. నౌర వీరారిగర్వవిదారియైన, సోమదేవునిరాఘవక్షోణిపాలు
దశదిశాత్యంతపరిపూర్ణధవళకీర్తి, లలితనిర్మలరుచిహాళాహాళికి బెదరి. 191

మ. అరయన్ రాఘవుపావకాంబకము మున్నావాహినీనాథునో
క్కరునిన్ స్రుక్కఁగఁజేసె రాఘవమహీకాన్తామనోహారిబం
ధురతేజంబనుపావకామ్బకము శత్రుక్షోణిభృద్వాహినీ
శ్వరులన్ బెక్కురనుక్కడంచుననుచున్ వర్ణింతురుర్వీజనుల్. 192

చ. పరబలభేది రాఘవనృపాలుఁడు పంకజనాభుఁగూర్చియ
ధ్వరములనగ్రహారములుదాత్తమతిన్ దగఁజేసి ధారుణీ
సురులకొసంగెఁబర్వముల శుద్ధసువర్ణగవాదిదానముల్
గరిమనుబిన్నశౌరిని జగద్వినుతున్ ఘనుఁగాంచె వేడుకన్. 193

క. ఆపిన్నశౌరి శాత్రవ, భూపాలురనెల్లఁగెలనఁబోరిగొని బాహా
టోపమున నేలె ధర సుఖ, మాపాదించుచును జనులకలజడి మాన్పెన్. 194

చ. కుపితవిరోధిరాజమదకుంజరసింహము పిన్నశౌరియే
లుపుడమియందునెందుఁగలలోపలనైనను గేలినైననున్
గృపణవిధంబు లోభమును గిల్బిషవర్తనబొంకునోటమిన్
గపటమునూయగోపమును గర్వముఁబుట్టదు లేశమాత్రమున్. 195

చ. అనఘుఁడు పిన్నశౌరి సుజనావనదక్షత రూపరేఖలన్
వినుతపరాక్రమంబునను విశ్రుతదానగుణంబు పెంపునన్
వనజదళాక్షుఁడత్తనయు వానివిరోధిని వానిమిత్రుఁడా
నెనయగు దీటువచ్చు మతియెంతయు సాటగుఁజూడఁజూడఁగన్, 196

తే. పిన్నశౌరియశమ్ము వెన్నెలకాకూళి, విన్నవారలఁ బలుకువేలఁదిఁ బుడుకు
దొడుకు రిక్కలేని నొడలిచూపడయని, మేటి తేజిఁబోలు దీటు లేమి. 197

ఆ. వైరిధారుణీశవంశపారావార, ములు దహించు మిగులఁ జెలఁగి జనులు
సన్నుతింపఁ బిన్నశౌరిప్రతాపంబు, బాడబానలంబు పగిదిఁ దనరి. 193

క. ఆరాజేంద్రుఁడు బుక్కధ, రారమణునిఁ గాంచె నతఁడు రాజకులసుధా
పారావారనిశాకరుఁ, డై రాజిలె సరససత్కళారూఢి మెయిన్. 199

చ. అతివిభవంబునన్ దితిసుతాహితరాజు మహాపరాక్రమో
న్నతి మృగరాజు సోయగమునన్ మరురాజు సమస్తసన్నుస
ద్ధతినలధర్మరాజు పటుధైర్యమునన్ గిరిరాజు వాక్ప్రశ
స్తత ఫణిరాజు నిర్దళితశాత్రవరాజగు బుక్కరాజిలన్. 200

శా. చక్షుశ్శ్రోత్రనరాహకూర్మగిరిరాట్సాంగత్యమున్మాని సం
రక్షాపేక్షమనంబునన్ దలఁచి గోత్రాదేవి యుల్లంబుఁ దా
నత్యుత్సాహ్వరయై మహాసుకృతియై యామోదితంబొప్ప స
ర్వక్ష్మాపంకరుఁడైన బుక్కవిభుశౌర్యస్ఫారదోశ్శక్తిపైన్. 201

సీ. అడుగనిచ్చితినిష్ఫలంతియ లేదనుమాట దాఁ బుట్టదే నాఁటనైన
గెలిచి యిచ్చుటె కాని కలననోటమియనుమాట దాఁ బుట్టదే నాఁటనైన
మనవెంత చెప్పిన విని పరాముఖఁ జేయుమాట దాఁ బుట్టదే నాఁటనైన
మొదటన చనవిచ్చి తుదనది వేఱగుమాట దాఁ బుట్టదే నాఁటనైన
తే. ననుచు జనులెల్లఁ బొగడఁగ నారవీటి, పురము నేలుచుఁ దనకులమును దదాఖ్య
నలర జెలసెను సతతకృతార్థవరుండు, రాజపరమేశ్వరుఁడు బుక్కరాజవిభుఁడు.

## బిరుదగద్యము.

జయజయ, స్వస్తి, శ్రీసంతత వేంకటాచలపతిచరణారవిందసేవాకందళిత సామ్రాజ్యసుఖోపభోగ, సాళువనరసింహరాయరాజ్యప్రతిష్ఠాపనాచార్య, శౌర్యగరిష్ఠ, సకలకళావిశారద, దైనందినవితీర్ణనానాదిగంతరాగతవనీపకజాలపరిపాలనగుణవిశేష, అసహాయశౌర్య, సుమేరుధైర్య, అష్టాదశవిద్యాప్రజ్ఞాప్రవీణ, రాజకులాభరణ, రాజరాజేశ్వర, పిన్నశౌరిరాజతనూజ, బుక్కరాజ, విజయీభవ, దిగ్విజయీభవ. 203

క. అని సకలరాజసభలను, వినుతింపఁగ బుక్కరాజవిభుఁడొప్పెను స
జ్జనులను గాచుచు దుష్టులఁ, దునుముచు ధరనేలె మిగుల దోర్బలశక్తిన్. 204

స్తంభ, వాక్కుంభీనససార్వభౌమారంభ, పరిపంథినృపపుండరీకాధిపరాజమండల కబళనవ్యగ్రీమోదగ్రమండలాగ్రసింహికాతనూజ, రామరాజ, విజయీభవ, దిగ్విజయీభవ. 210

క. అని బిరుదు పొగడఁగా బుక్కనృపాలునిరామభూమికాంతుండలరన్
వననిధిపరీతధాత్రీ, జనముల నయస్ఫూర్తిఁ బ్రోచి సన్నుతిఁగనుచున్. 211

సీ. పరమధర్మంబున వరవిభవంబున సరి ధర్మతనయుండు హరిహయుండు
సత్కాంతిసొంపున సంపదపెంపునఁ బ్రతి యామినీరాజు రాజరాజు
కమనీయగుణమున ఘనవితరణమున సెన దశరథరాముఁడినసుతుండు
విక్రమప్రౌఢి సద్విమలతేజోరూఢి సాటి నరుండు వైశ్వానరుండు
తే. గానియితరులనెటు దీటుగా నుతింప, వచ్చు సతతనతసకలవసుమతీశ
ముకుటమణిఘృణిసువిరాజమానచరణ, జలరుహుండగురామరాజప్రభునకు. 212

సీ. జగడాలు పచరించుజడదారిఁ జౌదంతిఁదంటవాకిట నెప్పుడు మెలఁగుపొలఁతి
నల్లవలువదాల్పుఁజెల్లెలిబలుడీవిఁ గన్నులుచెవులుగాఁగలుగుతేని
వెన్నునియన్నన్న వేల్పులదొరవాలుఁ నఱుకుదిమోములనలరుసామిఁ
జొట్టుకైదువజోడు గిట్టులలరొయెకిపూనిఁ బుడుకుఁదొడుకుమటిపుడుకుఁజెట్టు
తే. బొబ్బ మెకమును నీరింకుమబ్బునుబ్బు, గెబ్బు సంతతవిజయజేగీయమాన
మగుచుఁజాళుక్యనారాయణాంకుఁడైన, బుక్కరాజేంద్రురామభూభుజునియశము.

మ. ఒకకందర్పునిఁగూల్చె శంకరునికోపోద్రేకఫాలాక్షిపా
వకుఁడే హెచ్చది రామభూవిభునిదుర్వారప్రతాపాగ్ని వా
రక విద్వేషిమనోజగర్వముల సంగ్రామక్షమామండలిన్
వికలత్వంబు వహింపఁజేసె సకలోర్వీనాయకుల్మెచ్చఁగన్. 214

చ. సరసిజసద్మతో మిగుల సాటగుసత్గుణలక్షితాంగియై
పరఁగినలక్కమాంబను వివాహము బుక్కనృపాలురామభూ
వరుఁడయి యాపులోమజయు వాసవుఁబోలి మహానురక్తి సు
స్థిరతరభోగభాగ్యములఁదెప్పలఁదేలెను లక్కమాంబతోన్. 215

క. ఆరామనృపతికి మహో, దారుండగుతిమ్మరాజు ధన్యుఁడు కొండ
మ్మారమణుఁడు బుధనుతిపస, చ్చారిత్రుఁడు రంగవిభుఁడు జనియించిరొగిన్. 216

క. ఆతతభుజబలమున రిపు, భూతలనాయకులఁగలనఁ బోరిగొని కీర్తి
శ్రీతరుణిఁగాంచె విద్వ, ద్వ్రాతములకుఁ దిమ్మనృపతి ధనమిడి వేడ్కన్. 217

క. ఆతిమ్మనృపతి భూకాం,తాతిలకంబై నయవుడుఁ దా నేలుచు వి
ఖ్యాతిగ నప్పురిపేరన్, బ్రీతినిఁ దనకులము వెలయఁ బెంపొందె మహిన్. 218

క. ఖండనభూమిని సాక్షా, ద్గాండీవధరుం బనఁ గొండధాత్రీనాథా
ఖండలుఁ డగునని రిపుభూ, మండలపతులిత్తురరి నమస్కృతితోడన్. 219

క. దీనావనుఁ డౌ కొండమ, హీనాఘుం డాదవేని నేలుచుఁ బిదపన్
దానును సుతులును దల్పం, తానం బాయాదవేనిధామము పేరన్. 220

క. ఆరాజన్యులతమ్ముఁడు, శ్రీరంగాధీశ్వరుండు శ్రితసంరక్షా
ధౌరంధర్యముచే నా, శ్రీరంగాధీశుఁ డనఁగ క్షితి నుతిఁ గాంచెన్. 221

సీ. అంతఃకరణశుద్ధి నైన నవ్వులకైన నాడినమాటః సత్యంబు తేట
యనురక్తితో నైన నలకల నైన నింపొదవెడుచూపు సంపదలఁ జూపు
కృతమతి నైన సత్క్రీడానుగతి నైన నలగడు శీవి పుణ్యముల ఠావి
మమతతో నైన నేమఱి యైనఁ దొడఁబడ నర్తనపెంపుమిగుల ధర్మంబు సొంపు

తే. గాఁగ నసదృశబాహువిక్రమనిరూఢిఁ, దనరెఁ గర్ణాటరాజ్యపదస్థుఁ డగుచు
దుర్జయాహితరాజవిధుంతుదుండు, రామరాజేంద్రు శ్రీరంగరాజవిభుఁడు. 222

శా. రామాధీశ సిరంగరాజవిభుఁ డారా రాముతో సాటి సు
త్రామప్రోద్భవు నుద్దియౌ చు శరవిద్యాప్రౌఢిచే మించి యు
ద్దామామిత్రమహీశులం గెలిచి యుత్సాహంబుఁ బుట్టించి సం
గ్రామోర్విన్ జయలక్ష్మికిన్ వ్రాయు మనారాచాతిహేలాగతిన్. : 23

చ. అసదృశబాహుశౌర్యమున నారయ నెంగునజాతశత్రుఁడై
వసుధ సిరంగరాజజనవల్లభుఁ డేలెడి యాదినంబులన్
బిసరుహమిత్రమండలము భేద్యత నొంది చెలంగె రంభతో
నొసపరి బాగులం గదిసియుండఁగఁ గల్గఁగ బేరసూతికిన్. 224

చ. అనయము సిరంగరాజమనుజాధిపునిర్మలకీర్తికాంతితో
సరిమెలఁగంగ నోడి కద చాలనడంగి మడింగి భీతిచే
నురువడిఁ బాటి కాలెచట నూనుటలేక మొగంబు వాంచి యా
యురగకులాధిభర్త మహి నోరయి పోవుట పుట్టలెక్కుటల్. 225

మ. ఇల శ్రీరంగనృపప్రతాపము గడున్ హేరాళమై పర్వఁగా
వలఁ గాంతాయుతులై చరించు రిపుభూనాథుల్ భయభ్రాంతిచేఁ
బ్రళయార్కాగ్నులు రెండు నొక్కటయి భూభాగంబునం గప్పి రా
వలయుం జూడుఁ డటంచు నొండొరులతో వాక్రుత్తురల్లప్పుడున్. 226

తే. ప్రకటసాత్త్వికుఁడైన శ్రీరంగరాజు, లక్ష్మికెనయైన లక్షణాలక్షితాంగి
యైనతిమ్మాంబనుద్వాహమై చెలంగె, నధికతరభోగభాగ్యంబులతిశయిల్ల. 227

చ. అతనికిఁ దిమ్మమాంబకు గుణాఢ్యుఁడు కోనఘనుండు సత్కృపాం
చితమతి తిమ్మరాజు నృపసింహుఁడు రామవిభుండు నార్యస
న్నుతుఁడగు తిర్మలేంద్రుఁడు మనోజనిభాకృతియైన వేంకట
క్షితిపతి పుట్టిరంతయును శిష్టుల దుష్టులఁ బెంపనొంపఁగన్. 228

ఉ. నారులలోన నగ్రజుఁడు నారసముద్భవవైరివంశవి
స్తారుఁడు కోనభూపతి బుధప్రకరంబుల నైజదానదీ
క్షారతిఁ జండబాహుబలశాత్రవనిగ్గము నైజదానదీ
క్షారతి దివ్యభోగములఁ గ్గఁగఁజేయు దయాతిసారతన్. 229

క. హితమతియగు కోనమహీ, పతికీర్తికినుద్దిగాఁగఁ బఱతెంచి తదం
చితగరిమ కోడి భయమున, క్షితిధరజాధవుఁడు మూలశిఖరి వసించెన్. 230

ఆ. అతనియనుఁగుఁదమ్ముఁడగు తిమ్మభూపాలు, నర్యుఁడలరుఁ గీర్తిధుర్యుఁడచల
ధైర్యుఁడార్యవినుతచర్యుఁడంభోధిగాం, భీర్యుఁడసదృశోరుశౌర్యుఁడనఁగ. 231

సీ. జేజేలరాయనిఁ జెనకి కైకొనియెనో నిర్జితంబైనట్టినైషధంబుఁ
దలిరువిల్తునినోడఁదరిమి కైకొనియెనో సొగసైనయటువంటిసోయగంబుఁ
బుడమిదాల్పునకనఁగోలి కైకొనియెనో యంచితంబైనవాక్సంచయంబు
నళికలోచనునకుఁగెరలి కైకొనియెనో రహినిఁ గుబ్బడునిబ్బరంపుఁగలిమి

తే. ననఁగఁ దగ్గినఖ్యాతినతిశయిల్లి, సర్వసర్వంసహాజనసన్నుతప్ర
తాపనిర్జితారిసంఘాతశివాలి, తేజరిల్లెనట్టియార్వీటితిమ్మనృపతి. 232

తే. తత్కృత్రిమంబునఁ బ్రాలేయధామవంశ, మాతికృతార్థత్వము సహింప హరిదలంచి
రామరాజననుదయించెనామహీశు, ననుజుఁడిరుమలరాయనినలవి పొగడ. 233

సీ. పిశితభుక్కులకుఁ గృద్ధిభూషణారాతియైన పంకజాక్షుండు నీపాటివాఁడు
ధన్యసత్కమలసంభరణుఁడై రంజిల్లుకైరవాప్తుండు నీదారివాఁడు
కలితనేత్రలేఖారిగర్వాపహారియౌ ఘనశరాసనుఁడు నీకరణివాఁడు
ప్రస్ఫుటకమలజబాంధవుండైనట్టిజగదంబకుండు నీపాటివాఁడు

తే. అతికృపానూనకాంతిమహావిభూతి, తేజములఁ గాకయితరులు దీటెయనుచుఁ
గవిజనానీకవర్ణనఁ గాంచి జగతి, రహి వహించె నదిరుమలరాయశౌరి. 234

సీ. ఏఘనుసౌందర్యమిందిరానందనుసందమై సతులకానందమొసఁగు
నెవ్వనివితరణమిందీవరాప్తునిరీతినర్థులకతిప్రియమొనర్చు
నేరాజుభేరిభాంకారంబు రిపురాజతరుణులగర్భభేదనముఁజేయు
నేనృపాలునిసేవయెదిరించుఱట్టడిరాకుమారులనుజీకాకుపఱుచు

తే. నతఁడు నృపమాత్రుఁడేయరయను సపాద, కుతపశాహినిజామాదికుతలపతులఁ
జెండెదోర్గర్వఖర్వితాఖండలుండు, రణజయవిహారి తిరుమలరాయశౌరి. 235

చ. సరసిజపత్రనేత్రుఁడగుశౌరి పయోనిధికన్యకన్వియ
చ్చరులు నుతింపఁజేకొనినచందమునన్నగుణాభిరాముఁడా
తిరుమలరాయశేఖరుఁడు ధీనుతులొప్పఁగ వెంగళాంబనుం
బరిణయమయ్యె వేడుకనపారమహావిభవంబులొప్పఁగన్. 236

క. పతిభక్తిచేనరుంధతి, ప్రతి సంపదచే సరోజభవనసరిగ స
న్నుతిఁగన్నవెంగళాంబకు, నితరవధూజనము సరిగ నెట్లగునెన్నఁదగన్. 237

శా. ఆరామామణియందుఁదిర్మలనృపాగ్ర్యత్యుండు ప్రేమన్గనెన్
నీరేజాప్తసమానులన్నుతుల నిర్నిద్రప్రతాపారిసం
హారోగ్రప్రతిమానశౌర్య రఘునాథాఖ్యక్షమాభర్తనున్
శ్రీరంగాధిపు రామరాజవిభునిన్ శ్రీవేంకటాధీశ్వరున్. 238

క. ఆతిరుమలరాయతనూ, జాతచతుష్కమునఁనగ్రజనితుండును వి
ఖ్యాతయశుఁడు రఘునాథుడు, హేతిలనాథేశుఁడలరునినసన్నిభుఁడై. 239

మ సమరోర్విన్రఘునాథరాజవరుఁడశ్వంబుద్ధతిన్దోలి శౌ
ర్యమ్ముగండ్రుండినదొప్పె ప్రెంగెనుడుగుపాక్రధీశులనేత్రుచుఁబ
ల్లము గుఱ్ఱంబును నాలుగంటు నయి శోల్లన్వేగుచేటుట్లుగా
నమరుల్గన్గొని మేల్పెబాపు రియయానౌనంచు సర్ణింపఁగన్. 240

సీ. నీమూపురేఖతో నేసరియంచుఁబెనంగి మీనాంకుఁడనంగుఁడయ్యె
నీవాక్సరణికెన నేనిల్తునని యోడి చిలువరాయఁడు రసాతలముఁదూరె
నీకీర్తికిని జత నేననియటుగాక యబ్జారి చిన్నగా హరిణమునిచె
నీప్రతాపముజోడు నేనని నిలువకి ఖరకరుండుడుపీథిఁబఱవఁజొచ్చె

తే. నౌర నీసాటియిలతరులెట్లునఁగ వెలసె, నష్టదిగ్రాజహృదయభయదవరాహ
బిరుదకేతనుఁడరిగిరిభిదురపాణి, యైనరఘునాథమేదినీజానియలరు. 241

క. ఆరఘునాథమహాధా, త్రీరమణునియనుజుఁడైనశ్రీరంగవిభుం

డారాముమాడ్కి నేసుమతి, నారూఢిగ నేలె నిర్జితాహితుఁడగుచున్. 242

సీ. తొలిపల్కు గుత్తాలఁ దోలెడు నెఱజాణ కూర్మి ముమ్మనుమని కొడుకుకొడుకు
జాలుఁదొయ్యాలి నేలు జాణయె న్నెడువాని కొమ్మసై దోడులోఁ గొన్నయతఁడు
చిలువలఁదినుచుండుపులుఁగుఁద త్తడి నెక్కునట్టి వేలుపు గేస్తురాలికొడుకు
చిలుక పైఁజను వాని చెలికాని చేపన్న సొరుగు గూరనుండెడి దొరసుతుండు

తే. దానగాంభీర్యసౌందర్యధర్మములను, సాటిపత్తురుగాకొరుల్నా వెతలఁప
నారవీటిపురాధ్యక్షుఁడా తిరుమల, రాయదేవేంద్రు శ్రీరంగరాయమణికి. 243

సీ. గడివిజాపురనరకామినీగర్భముల్ ఛేదించు నెవ్వని భేరిరవము
దామిడిబోయినిజాముపట్టణముల ధూళిగాఁ జేయు నే దొరబలంబు
గోలకొండనుజీర్ణకోటులు కాయముల్ చించు నే రాజేంద్రు చేతికత్తి
సకలభూపాలకాస్థానసన్నుతిఁ గాంచి వెలయు నే సూరుని విజయలక్ష్మి

తే. యతఁడు కపిలన్నపతి యేయఘువిసూర, చర్యుఁడాశ్రితరక్షావిచక్షణుండు
జీర్ణకర్ణాటభూపునర్జీవనుండు, రమ్యగుణశాలి శ్రీరంగరాయమౌళి. 244

తే. రాజగుణహారి శ్రీరంగరాయశౌరి, ప్రీతితోఁ దిమ్మమాంబను బెండ్లియయ్యె
నావధూవరులఖిలసౌఖ్యములు మిగుల, నొసిరవని ధరాత్మజేశులను బోలి. 245

క. ఆవిభుతమ్ముఁడు రామన, రావిల్లభుఁడమరునాదిరాజులచర్యల్
దీవరనుతరాకేందుయ, శోవిస్తారతనునధికశూరత్వమునన్. 246

మ. ఘననిర్ఘోషము శైలరాజతనయాకాంతోరుఘక్కాపటు
స్వనము న్గెల్చిన రామరాజనృపునిస్సాణంపునాదంబులే
విని ఘూరేతరులై తురుష్కయవనోర్వీనాయకుల్గామినీ
జనయుక్తంబుగ డాగియుందురు మహాశైలంబులన్గానలన్. 247

ఉ. రామమహాశ్వగుంఫ ఘణపంగిముననందు నిజాముసేనలన్
భీమపరాక్రమస్ఫురణఁ బీఁచమణంపఁగ సాటికెన్నుచున్
రాముగణంబు చందమిది రాయిలఁ దాతఁ డెయౌనటంచు నా
తామరసోద్భవోద్భవుఁడు తాళములొత్తును నాట్యమాడుచున్. 248

క. కృతకృత్యుండగురామ, క్షితిపతి నరసింగమాఖ్య సీమంతినినం
చితధర్మవిధినిఁ బరిణయ, మతిముదముదలిర్పనయ్యె నాసతిపలనన్. 249

క. అజనపతి కాంతివిభవ, రాజేంద్రుని విజయనిభపరాక్రమరేఖా
రాజితఘను శ్రీతిరుమల, రాజును గనియెఁ దదనంతరంబున మఱియున్. 250

క. అతనికి శ్రీరంగమహీ, పతిగలిగెను నామహానుభావుఁడు శౌర్యో
న్నతి వేంకటపతిరాయనృ, పతి చేయువరాజపట్టబంధము నొందెన్. 251

చ. తిరుమలరాయరాజహిమదీధితి రామమహామహీమనో
హరుని సిరంగరాయనియు నార్యజనస్తుతిచేఁ దనర్చు నా
నిరుపమదానవైఖరుల నించె నజాండముఁ దత్కీర్తిసంబుకై
శరనిధియప్పులం బొగలెఁ జందురుఁడుం గిడుఁ గందె సారసుల్. 252

సీ. పాఱదా రిపుకదంబము బెడాబెడలుగా నుసవడి మొనలపై నుఱికినపుడె
భయమందదా పద్మబాంధవమండలంబరిఖండనోత్సాహ మలరినపుడె
మోహంబు చెందదా ముగ్ధాంగనారాజి సోయగంబొక్కింత చూచినపుడె
సమ్మోదమందదా క్ష్మాజనానీకంబు కరుణార్ద్రదృష్టిచేఁ గనినయపుడె
తే. యారయ సహాయసూరుఁడు నరికృతాంతుఁ, డంగనాజనమూర్త్యంతకాంతవరుఁడు
ధర్మతత్పరుఁడనుచు భూపవ్రజ వినుతిఁ, గనియె శ్రీరంగచికరాయమనుజవిభుఁడు.

తే. రాజకులభూషణుఁడు చిక్కరాయభూప, శౌరి పరిణయించె జిల్లెళ్ళ నారసింహ
రాజదేవేంద్రపుత్త్రి యంభోజనేత్రి, నైనయోబమ్మదేవి నయప్రవర్తన. 254

తే. ఆవసుమతీశునకు రామదేవరాయ, లుదయమైనను రిపురాజులొదిగి శైల
గుహలఁ జేరిరి రవిదోఁప ఘూకచయము, లతిభయంబున నొంగునట్లనఁగు నగిది. 255

సీ. సింగనృపతి భీమసేనుఁడు రాయప్పశ్వేతాశ్వుఁ డయ్యనచెన్ననృపులు
మాద్రేయులితరభూమండలేశ్వరులు వింటపాంచాలాదిరథికవరులు
రఘునాథనాయకాగ్రణి యనుకృష్ణసహాయమ్ముగాఁగను నాజిఁ జెంచు
పేరప్పయాచనవిభుమాకభూపదుశ్శాసనసౌబలత్వకర్ణ
తే యుక్తముగ జంగరాజదుర్యోధనుని వ, ధించి సంతసమున రామదేవరాయ
ధర్మతనయుండు ప్రజలు మోదంబుఁ బెరుగ, ధరణిఁ బాలించె ధర్మవిస్ఫురణ మెఱయ.

సీ. రాజాధిరాజవీరప్రతాపోజ్జ్వలుఁడగు రామదేవరాయనృపతుహిన
ధాముఁడు పోచిరాజు శ్రీరామరాజాత్మజయోబమదేవి గొబ్బూరివంశ
పావనుఁడరిగిరిపాకారి యలిరాజుసుత కొండమయుఁగులసతులుగాఁగ
పరిణయించి యోషితాద్వయమతిధర్మసహాయమై వర్తిల్ల నధ్వరములు
తే. భూసురోపనయనతులాపురుషకన్య, కాశ్వగజగోహిరణ్యవస్త్రాన్నభూమ
ఖాదిదానంబు లొనరించి యాదిరాజ, చర్య వర్తిల్లె భూజనుల్ సన్నుతింప. 257

ఆ. రామదేవరాయరాజేం. దు,సతీ— రి. సాటివత్సవన భుజంగమాసం..

పతికి జిహ్వ సరిగఁబగిలెనంచును భీతి, సీరి మేన నీలిచీరఁగప్పె. 258

తే. మనుచరితనిట్లు సుతుఁడు మన్నఁడునుదనర, నలరునామానవీభర్తకనుజుఁడైన
వీరవేంకటపతిరాయవిభుఁడు వసుధ, కెల్లరాజయ్యె భూజనులెల్లఁబొగడ. 259

సీ. బలముగూడినఁజూచి నిలువనియిభరాముకొడుకుభీతికి గోలకొండ సాక్షి
వెన్నాడి తత్సేన వీఁగఁదోలుటకునుబృథుపరాక్రమమునను బ్బపెన్న సాక్షి
నీవాఁడననఁ బ్రోచి నిర్భయంబుగ వానికిని మేరయిడుటకుఁగృష్ణ సాక్షి
యెదిరించుపైరులపద మెల్లనాలీలఁమూలించుటకును నందేల సాక్షి

తే. గాఁగనసదృశబాహువిక్రమవిభూతి, దనకు వేలూరు నగరాజధానిగాఁగ
వీరవేంకటపతిరాయవిభుఁడు మిగుల, ధరణిఁబాలించె ధర్మతత్పరతఁజెలఁగి. 260

సీ. వాఙ్మహావిభవంబు వర్ణింతునంటినా భావింపఁజన్నగకీర్తియతఁడు
గుణములచెలువుఁబేర్కొనియెదనంటినా వీక్షింప శేషాద్రివిభుఁడతండు
అతిధర్మవర్తన నుతియింతునంటినా గంపవయాధర్మజుండతండు
నీతిమార్గస్ఫూర్తిరీతిట్టిదంటినా పరికింపఁగా బృహస్పతియతండు

తే. గాన బుధజనసన్నుతిఁగన్నయార, వీటి వేంకటపతిరాయవిభునినితర
మనుజనాథులరీతిని వినుతిసేయ, నలవియేయాఘనుండు కేవలుఁడె తలఁప. 261

సీ. పరమపాతివ్రత్యగరిమచే మిక్కిలియతిశయిల్లినవెంకటమ్మగారిఁ
జిరయశోనిధియైనజిల్లెళ్లరంగనృపాధిపుపుత్రినోబమ్మగారి
జిల్లెళ్లకృష్ణరాట్ప్రభితమయూఖుప్రియాత్మజయైనకృష్ణమ్మగారి
భూరిశౌర్యోగ్రగోబ్బూరియోబళక్షమాధ్యక్షుతనూజఁగొండమ్మగారి

తే. నెమ్మి నరుసఁబాణిగ్రహణమ్ముఁజేసి, వీరవేంకటపతిరాయవిభుఁడు వేడ్క
నలరునప్పద్మముఖులతో ననుదినంబు, నధికసౌఖ్యాంబునిధినోలలాడె మిగుల. 262

ఉ. ధీరసుమేరువేంకటపతిక్షితినాథునిచారుకీర్తిదా
నారయఁబద్మజాండమున నంతట నిండి పొగడ్తఁగాంచె స
ద్ధీరులచేతనయ్యమృతదీధితికిన్భుజగాఖ్యమంబునన్
భూరికళంకమున్నొగపెఁ బోల్కికి నేనెనయంచుఁదోఁచినన్. 263

తే. రహినినిటువలె యామిసీరాజవంశ, వర్ధనుండగుతిరుమలవసుమతీశు
ననుజుఁడగు వేంకటాద్రిరాజాన్వితంబుఁ, బలరునాదిమనృపచర్య మెలఁగి మిగుల.

తే. అసదృశోరుశౌర్యుఁడాహవగాండీవి, వేంకటాద్రిరాజవిబుధరాజు
అని బిరుదు గెలిచియాతనిబిరుదు మే, శమ్ముఁగొనియె భూజనమ్ముపొగడ. 265

సీ. కందుకక్రీడఁగాఁగదనరంగస్థలిఁ గడు వజీరులమస్తకములఁ దునిమి
హరులనుబోరిగొని కరులనుదునిమి తదారోహకులఁద్రుంచి వీరభటవి
దళనంబుసేసి దుర్భరపతాకలఁగూల్పఁగనుఁగొని కాందిశీకత వహించి
వీఁపుఁబట్టనునాస విడిచి నిజాము యేదుల్ఖాను కుతుపశాహుల్పదళంబు
తే. విచ్చి వెన్నిచ్చి కనుకనియిచ్చఁబఱచి, మెచ్చఁజొచ్చినవభయంబునిచ్చి విజయ
కాహళులుమోఁగియనియమింపెక్కుజనంబు, లభినుతుల్సొనర్పఁగా వేంకటాద్రిరాజు.

ఉ. ఏలెనుగందనోలుపుర మింద్రసమానుఁడు వేంకటాద్రిభూ
పాలుఁడు ధర్మకీర్తినరివర్గము బీరముదక్క మత్తశుం
డాలతురంగహేమఘననవ్యమణీచయమిచ్చి రేపగల్
ఫాలతరాగ్రసీమఁగరపంకజయుగ్మముఁ జేర్చి కొల్వఁగన్. 267

చ. అనిశము గోహిరణ్యవసుధాశ్వతులాదిసమస్తదానముల్.
వనరుహనేత్రుఁగూర్చి ద్విజవర్గము రాగిలనిచ్చి రంగమాం
బను మఱి కృష్ణమద్దగ వివాహమునక్రమమొప్ప వారివ
ల్లనుగనె వేంకటాద్రినృపలక్ష్ముఁడు రంగపరామరాజులన్. 268

తే. దర్పితారాతిగర్వవిదారకాతి, చండదోర్గర్వమండితమండలాగ్ర
పాండితిని మించె రామభూపాలుఁడఖిల, రాజసన్నుతులెసఁగ ధరాతలమున. 269

ఉ. సంగరరంగమందు హరిశౌర్యమునన్ప్రభవైకదీప్తుఁడై
రంగపరాజశేఖరుఁడరాతిబలంబులనుక్కడంచె సా
రంగధరుండొ యాపరశురాముఁడొ స్కందుఁడొ రాఘవుండొ యీ
స్సంగనితండటంచును జనమ్ము సన్నుతులుల్లసిల్లఁగన్. 270

మ. ధరణీచక్రము నాల్గుపాదములచే ధర్మంబు వర్తిల్లఁగాఁ
బరిపాలించెను రంగపాధిపుఁడు శుంభద్బాహుగర్వోన్నతి
స్థిరుఁడామేటి మఖంబులన్ ద్విజులచేఁ జేయింపఁగా దేవభూ
సురసంఘంబతితుష్టిచే సిరులచే శోభిల్లనశ్రాంతమున్. 271

శా. నెమ్మిన్ రంగపరాజశేఖరుఁడు కోనేటమ్మఁ దిమ్మమ్మఁ జె
న్వమ్మమ్మువ్వురఁబెండ్లియయ్యెను బ్రమోదాయత్తుఁడై బంధులో
కమ్ముల్మెచ్చ మహావిభూతినిటులాకాంతామణుల్దాను సౌ
ఖ్యమ్ముంగాంచెను ధర్మతత్పరతనత్యంతంబు వర్తిల్లుచున్. 272

న్వితుఁడైనవేంకటాద్రి, క్షితిపతి జనియించెనార్యకీర్తనలెసఁగన్. 273

క. ఆరంగపరాజశౌరి, శ్రీరమణునకుదయమయ్యెఁ దిమ్మాంబాయో
పారత్నమువలన మహో, దారుఁడు గోపాలరాజధన్యుండెలమిన్. 274

సీ. శ్రీకృష్ణగోపాలసేవావిహారవిచక్షణుండురుధర్మరక్షణుండు
నందితకువలయానందకరాన్వయమండనుండఖిలారిఖండనుండు
రాజీవపత్రేక్షణాజనతాపంచసాయకుండర్థ్యర్థదాయకుండు
బాహుబలోగ్రసపాదమహాబలభంజనుండాశ్రితరంజనుండు
తే. సతతసేవకనరనరాంచితకిరీట, ఘటితమణిఘృణిలలితాంఘ్రికమలుఁడార
వీటిగోపాలరాజభూవిభుఁడు కంద, నోలు నిజరాజధానిగానేలె ధరణి. 275

క. చాల వితీర్ణినిఁగర్ణునిఁ, బోలును దుర్జయవిరోధిభూపాలకగో
పాలవధూటీజనగో, పాలుఁడు గోపాలరాజ పార్థివుఁడెలమిన్. 276

ఉ. శ్రీలలమిన్నెలంగఁగ వరించె ముదంబున రంగపేంద్రుగో
పాలనృపాలచంద్రుఁడతిపావని గొబ్బురిగిర్యధారుణీ
పాలునిపుత్త్రి వెంగమనుపంకజనేత్ర జిలేల్లరంగగో
త్రాలలనామనోహరసుతామణిఁదిమ్మమనున్మహోన్నతిన్. 277

క. ఆపద్మముఖులుదనునను, రూపగుణంబుల భజింప రూఢిగఁగాంచెన్
గోపాలరాజరాజని, శాసతి సతతంబు సకలసౌఖ్యములెలమిన్. 278

తే. అననినిట్టునలెఁబుత్త్రపౌత్త్రాభివృద్ధి, గహాని వర్ధిల్లతిరుమలరాయవేంక
టాద్రిరాజానుజద్వయమధికశక్తిఁ, గొలువ నళిరామభూపాలుఁడలరు మిగుల.

తే. సలకవిభుతిమ్మరాజుసేనలనుద్రుంచి, గుత్తిఁబెనుగొండ మఱి గండికోటఁగంద
నోలుపురమాదవేనవలీల గెలిచి, తొలుదొలుత రామనృపతి దోర్బలము మెఱసె. 280

శా. తారాక్షీశ్వరగోత్రపాలనచమత్కారుండునై దానవి
స్తారోదగ్రతనర్థి మించి రిపులన్ దండించి ధాత్రీజనా
ధారప్రక్రియనొందియింద్రజిపురాధ్యక్షేశుఁడై మించు మా
శ్రీరంగేంద్రునిరామరాజవిభుఁ డా శ్రీరాముచందంబునన్. 281

సీ. హరిశౌర్యుఁడగుతిర్మలాధీశ్వరుండుదదపరజుండగు వేంకటాద్రిరాజు
భుజయుగంబుగ బలస్ఫురణతోఁగరిహరిరథవీరభటులతో దొరలతోడఁ
దనయాజ్ఞమీఱినకినుక నిజాముపై దండెత్తి తఱిమియుద్దండవృత్తి
నతఁడేలుచున్నట్టియామదానగరంబు చాలెత్తి మఱియామదాలు వేసి

ఆ. సేతుకాశిమధ్యభూతలనుతజయ, శ్రీవరించి వేడ్కఁ జేఁ జెలంగె
రామమూర్తియైనరామరాజేంద్రుఁడు, సాంద్రవిభవజితసురేంద్రుఁ డెలమి. 282

సీ. దళితనిజామాదిబలశోణితప్రవాహినులచే జలధి నేఘనుఁడు నించెఁ
గుతుబుకోసుమత్స్యకుతుబుకదూశాదిభూపతులచేఁ గాన్కలే ప్రభువు గొనియెఁ
దనపేర దేవతాస్థలులనపసరముబ్బ క్షితో నెవ్వఁ డేపతియొనర్చె
నతిరాత్రపౌండరీకాదియాగమ్ములు సేయించి ప్రీతి నేకీర్తిపుఁ డవరె
తే. నతఁడు కర్ణాటరాజ్యరమాధినాథుఁ, డార్యరక్షావిచక్షణుండద్రిధైర్యుఁ
డనఘచారిత్రుఁ డఖిలరాజాధిరాజ, రాజపరమేశ్వరుఁడు రామరాజవిభుఁడు. 283

క. నడతయొకింతయు లేదే, కృక్కఁడు బహుగండములుఁ బొఁసుకొనునని గిరులన్
విడిచి సుఖవసతికొఱకై, పుడమిపడఁతి రామరాజుభుజమున నిలిచెన్. 284

శా. రారాజేయభిమానశీలుఁడు సుభద్రానాథుఁ డేడ్కన్వికం
పారిఘోద్భవుఁ డేసురూపి రవియే యత్యుగ్రతేజుండు మం
దారక్ష్మారుహమే ప్రదాత విధుఁ డేనందత్కళారాశి మా
శ్రీరంగాధిపురామరాజమహిభృచ్ఛ్రీతాంగు నర్ణింపఁగన్. 285

ఉ. యామవతీశవంశకలశాంబుధిపూర్ణసుధామయూఖుఁడౌ
రామనృపాలుకీర్తిసరి రానుబెనంగి తొలంగి మూలను
ద్దామతఁ గొండరెక్కి హిమధామపరుండురుభీతి మేనఁ దా
సామునవార్యనుంచి మఱి సామునఁ గప్పె మదేభచర్మమున్. 286

చ. ఎలమిని రామరాజవసుధేశుప్రతాపమవార్యమై మహిన్
జెలువుగ నిండఁబర్వి శశిశేఖరదివ్యమహాశరాశుగ
జ్వాలనశిఖాసముత్కరముచందమునందమునొందె నెంతయున్
సలకయతిష్ఠయాప్రముఖశత్రుపురంబు లనెల్లనారయన్. 287

బిరుదగద్యము.

జయజయ, స్వస్తి, సమస్తసన్నుతప్రశస్తమహేంద్ర, గండరంగిరామచంద్ర, కల్యాణమహీపాలభాస్వర, కల్యాణపురవరాధీశ్వర, కన్యాకుమారీ భీమరథీ తటాంతరనిక్షేపవిజయస్తంభ, స్తోత్రార్హయశఃప్రక్రియాపావనచరిత్ర, ఆత్రేయగోత్రక్షత్రియకులపవిత్ర, మహితకేళికాపారాయణ, మహితచాళుక్యనారాయణ, ధానుష్కచక్రవర్తిబిరుద, చాళుక్యచక్రవర్తిబిరుద, నానావర్ణమండలీకరగండ, దైత్యభరగండ, హ తిబ్బరగండ, భాసురభుజాదండ, జయబిరుదరగండ, అసమసాహసగండ,

హోసబిరుదరగండ, గండరగండ, ఘనీకృతమదేభశరజన్యలంపట, త్రిభువన
బిరుదులవెన్నుసమ్మెట, పట్టెసరాయనిజానిష్ట, ఒడయరాయనిశాభట్టశిష్ట, వర్గరాయ
ఘనప్రియంకర, అష్టవిగ్రాయమనోభయంకర, విజయచరితసింహాసనాభాస్వర,
విజయనగరసింహాసనాధీశ్వర, యుక్తవర్గసద్యోధనపుర, గుత్తిదుర్గనిర్భేదనపుర,
వాదిపురతస్కరభరణ, ఆదవేనిదుర్గాపహరణ, ఘనచండవర్గబాధక, పెనుగొండ
దుర్గసాధక, మంద్రగిరిదుర్గభాస్వర, చంద్రగిరిదుర్గరాజ్యాధీశ్వర, శబ్దపరిశుద్ధ
పాలక, ఉద్దగిరిరాజ్యపాలక, కాయదుర్గతనయబంధుర, రాయదుర్గావనధురంధర,
వందనశీలకిరీటపాదక, కందనవోలుకవాటభేదక, చాటూరుఘణితినిర్వాహక, జూ
టూరుసమరనిర్వాహక, చండనపాటిఖడ్గనాయక, కొండవీటిదుర్గనాయక, పుట్టప
ల్లిసీమాధిష్ఠితధామసాగర, గట్టుహళ్లిసీమాప్రతిష్ఠితధామసాగర, వంకాదిమవీరసమా
సంగిత, బంకాపురవీరరమాలింగిత, సాంద్రకీర్తినిరంతర, చంద్రగుప్తిధరాంతర, ఆచా
రరాజ్యావయవచర్య, రామూరురాజ్యహరణధుర్య, మదచండవర్గాదిదాయక, ముదు
గంటిదుర్గాధినాయక, పరిభల్లువరణభూషణ, ఓరుగల్లునగరపోషణ, విజయకరాయ
తనాయక, విజయాపురభయదాయక, నర్ణనాదికరక్షోపకార, పొల్లలాపురసంక్షోభ
కార, కల్యాదినృపకబాధక, కల్యాణనగరసాధక, సామదానముఖ్యశీలసంజన, ఆ
మదానగరసాలభంజన, ధానకరమార్గవిక్రాంతిసార, దేవగిరిదుర్గ సమాక్రాంతిధీర,
గౌతమీస్నానపావనాకార, కౌతుకాఖిలభూజనాధార, బలిచాపలిజన్యదాయక,
హాలిపురచాంచల్యకారక, ఘడితకూటతమసింహాసంహనన, బెడదకోటనగరసింహ
సంహనన, బలికిరికూటపాకలశౌర్య, కలుబరగికోటపాటనధుర్య, నగరసమాక్రమ
ణవిచార, సగరసమాక్రమణధీర, పరచండనిర్గతికింకర, పరచండదుర్గభయంకర,
సంసదుర్గకేతుహరణ, హంసదుర్గనిబర్హణ, స్వర్ణాటకవర్గసద్గ్రంథనాసిక, కర్ణాటక
బుధధన్యాసిక, జుహున్నరభయనిర్ణాయక, నిర్వాణసామజసముద్రద్రునిష్ఠాధిదా
యక, సామగిరిదాపక, రామగిరిదుర్గప్రతిష్ఠాపక, మేదినీతలసమగ్రసంపాదన,
యాదగిరిదుర్గభేదన, శీలచండమృదుభాషణ, గోలకొండపురదూషణ, అయాలకొండ
చండవిమతహాలాహల, అయిలకొండహరణకౌతూహల, సానుభల్లుధృతిపరాక్రమ,
సానుగల్లుకృతిపరాక్రమ, పానుగంటిదుర్గపాటనధుర్య, భూనుతసాహసధుర్య,
నెల్లితిచండిదుల్లగ, బెల్లముకొండవల్లభ, నిలయాలోపగర్జితాకార, మలయకేళిమహి
మాధార, కామసమాచరణాక్రమణ, సోమపదమానవచనాక్రమణ, శావగదుర్గబా
ధక, మావుడదుర్గమాధక, ఖండితసమగ్రసంధాచణ, దండితసమస్తశత్రుగణ,
అక్షారూషవక్షోనికర, మక్షాకోటదక్షోనికర, మక్షాకోటశిక్షానికర, అక్షారూషశి
క్షానికర, ఉల్లీషనిజాస్తకల్లోలజాలక, ఢిల్లీపురహల్లకల్లోలహాలిక, కేళీసుమందార

గతబృందాయక, గోలేరుసందేరూభయసందాయక, కలంబవర్గసంభాసుర, కలంబ దుర్గకంపాసుర, భూగోళరుచిరభూషణ, పైగోవనగరభీషణ, కొండపల్లిహరణ, చండకరనిభప్రతాపభరణ, వినుకొండపాలక, వినూత్నకృతనాగార్జునుని కొండ సాలజాలక, అవంతీకలితపూరణ, అవంతీమదవిదారణ, కటకరాజ్యాధివర్తన, కటకరాజ్యఘటితకీర్తన, అజికరేంద్రదాయణశరాసన, రాజమహేంద్రరాజధనుశ్శాసన, బూదలఖానుతిక్తాంగహరణ, యేదులఖానుసప్తాంగహరణ, నిదానమలకగుణసహజాపగాధిచారక, నిదానమలకభుజాబలాపహారక, రమాధిపవినుతాపదానకీర్తన, ఇమాదనమలకమానమర్దన, ఘృతరిపుదళనబంధుర, కుతపనమల్కదళసింధుర, కరీశతరుణాకారేశసుగుణాభరణ, ఒకీదుబలహరణ, భుజకృతరిపుధావనావిధాన, గజపతివినుతపరాక్రమావధాన, కలికర్కశసమగ్రస్తంభీకృతారాతివర్గవిశాల, కలివర్గమననిర్గతపరతర్కవారాశివర్గకేళి, గిరిదుర్గ వనదుర్గ జలదుర్గ స్థలదుర్గ చతురశీతిదుర్గ సమస్తదళవిభాళి, రిపురాజగోపికాగోపాల, గాయగోవాళ, శ్రీరంగరాజరామ భూపాల, విజయీభవ, దిగ్విజయీభవ. 288

తే. అని హిమాచలసేతుపర్యంతధరణి, పతులసభలందు సత్కవుల్ ప్రణుతిసేయ
వెలసె నెంతయు నార్వీటికులపయోధి, చంద్రుఁడైనట్టి రామరాజన్యవిభుండు. 289

తే. అనఘుఁడా వైరసేని భీమాధిపేంద్రు, పట్టి దమయంతి చేపట్టినట్టి కీర్తి
రామభూపాలకుఁడు కృష్ణరాయతనయ, యగుతిరుమలాంబను ద్వాహమయ్యె వేడ్క.

చ. శతమఖునింబులోమజను శంకరునిన్గిరిపుత్త్రి శంబరా
హితు రతిదేవిఁబోలుచు నహీనసుఖానుభవాప్తి రామభూ
పతియును దిర్మలాంబయును భానుసమానునిఁ గృష్ణపార్థ్యునం
చితగుణుఁ బెద్దతిమ్మనృపశేఖరుఁ గాంచిరి హర్ష మొప్పఁగన్. 291

సీ. మఱియును నారామమానవాధీశుండు జిల్లెళ్లకులసుధాసింధుచంద్రుఁ
డగు పెద్దనందిరాజాగ్రణిసుత నప్పలాంబను బోచిరాజాన్వయావ
తంసముఁ దిమ్మభూధవుప్రియాత్మజలఁ గొండమ్మలక్ష్మమ్మయును నగఁ బరఁగు
సరసిజవదనల నరుసతో నిరువురనతివైభవోన్నతులతిశయిల్ల

తే. సతులనిటు ముగ్వురను బంధువిత్తతి వొగడఁ, బరిణయం బయ్యె సంభ్రమభరితుఁడగుచు
నబ్జగర్భగురుండు పీతాంబరుండు, శ్రీమహీనీళలను నెరించినట్లు. 292

క. ఆత్రేయధర్మపరతనా, శాతోదరియందు రామజనపాలుఁడు వి
ఖ్యాతిగ దక్షిణనాయక, రీతి మెలఁగి వినుతిఁదా ధరిత్త్రిని గాంచెన్. 293

తే. ఆయదూద్వహుదేవులయందు మిగులఁ, గాంతునమరకీర్తిఁ గనుభోజకన్యపగిది
రామభూపాలుసతులలో రమణుమన్న, నలను లక్ష్మాంబ మిక్కిలియలరుచుండు.

శా. ఆరామక్షితిభర్తగాంచెనుబ్రహ్మోదాయత్తుఁడై కొండమాం
బారామామణివల్లఁగొండఘరణీపాలేంద్రు సద్వర్తనుం
డారామారిపురీశుఁదిమ్మవిభు లక్ష్మాంబాపయోజాస్యయం
దారూఢాత్మ సిరంగరాజనసుధాఖ్యత్తున్ దయాబ్జాత్తునిన్. 295

తే. ఈవిధంబునఁదిరుమలదేవి కొండ, మాంబ లక్ష్మమ్మయను దేవులందు రామ
ధరణిపతి గాంచె సుతుల నేవురను వార, లలరిరీశునిపంచాస్యములనుబోలి. 296

క. వితరణరేఖను రాధా, సుతుఁడంచితభోగగరిమ సుత్రాముఁడనన్
నుతిఁగాంచెఁగృష్ణరాయ, క్షితిపతిదౌహిత్రుఁడైనకృష్ణేందుఁడిలన్ 297

క. కృష్ణమహీపతి గంపవ, కృష్ణుఁడు విమతబలహననకీర్తిని సాక్షా
త్కృష్ణుఁడు సతోష్యషణన, తృష్ణకిరణసదృశుఁడెన్నను రుతేజమునన్. 298

మ. హరిశౌర్యుండగు రామరాజవిభుకృష్ణాధీశుసత్కీర్తియా
సురనాథేభము నెంపఁగొట్టి జలజస్తోమంబులంగట్టి భా
సురముక్తామణికాంతిఁదట్టి తుహినక్షోణీధ్రము న్మెట్టి తా
నురిఁబొమ్మంచను బొమ్మఁబెట్టుఁగరఁచున్న క్షేశ్వరస్త్రీకులన్. 299

ఉ. ధైర్యయుతుఁడు రామరాజపెదతిమ్మవిభుండని వాజిఁదోలి లోఁ
బాయనిభీతిచేత మొన భగ్నముగా యవనుల్ద్గోలంగనా
చాయ నిజాముఁడడ్డపడ సామజయూథముఁద్రుంచెఁజూపరుల్
వాయుజుఁడంచు నెంచఁగనవార్యసముజ్జ్వలబాహుశౌర్యుఁడై. 300

క. పెదతిమ్మనృపతి మజీయును, మదకరిహరివీరభటసమాజముతోడన్
గదనమునఁగదియుతురకల, సదమదముగఁ జునిమె బాహుసంరంభమునన్. 301

ఉ. రాయకులీనుఁడైనయళిరామనృపాలుని పెద్దతిమ్మభూ
నాయకమౌళి యిచ్చు దిననాథతనూభవుమాడ్కి నర్థికిన్
ద్రోయక కోరుకోరికలు తూర్ణముగాఁ గడుఁగీర్తిచంద్రికల్
దోయజసంభవాండమునఁదోరములై కనుపట్టుచుండఁగన్. 302

ఉ. మావులు నేనుఁగుల్భటసమాజము పేనుఁగు పెంటగాఁగ గం
గావలినుండి కృష్ణదనుకానొనరించి నిజాముఁదోలి రా
మావనినాథుఁగొండవిభుఁడాహవకేళిఁజరించెఁజూచియా
దేవతలెల్లనిఘనుఁడు దేవపరాత్తుఁజూడంచు నెంచఁగన్. 303

ఉ. సారదయావిశిష్టగుణసన్నుతరామనృపాలుకొండధా
త్రీరమణోగ్రఖడ్గహతిఁ బ్రెల్లి తురుష్కవిభుల్పరింతురి
చ్ఛారతినొక్కతొక్క తెవశంబు పదైదుగుర్లు సేసతా
చారుమృగీవిలోచనలసంగతి నైజగుణంబెయాఁగదా. 304

ఉ. ఏలుచునానెగొందిపురమింద్రసమానుఁడు కొండధారుణీ
పాలుఁడు పొల్చె శాత్రవులు బంటుతనంబుల మాని చానడిఁన్
వేళయెఱింగి కాంచి మఱి వేళమునన్మకుటాగ్రరత్నరు
గ్జాలముచేతి నాత్మపదకంజయుగంబునలంకరింపఁగన్. 305

క. సూరపవాహాధీశ్వరు, కూరిమిసుతఁదిరుమలాంబఁగులసతిగ మహో
దాగత వరించె రామ, స్మారసమునికొండనృపతి కడు వేడుకతోన్. 306

క. ఆమహితాత్మునితనయుఁడు, రామాధిపుఁడహితకమలరాకాశశియై
భూమిఁ బ్రజలెప్రుడునధిక, క్షేమించఁగనేలె నీతి చెలువుదలిర్పన్. 307

క. హరిభక్తిపరుఁడు సుగుణా, కరుఁడంచితదానవిజితకర్ణుఁడు రజన
కరకులుఁడు కొండధాత్రీ, శ్వరరామనృపాలుఁడిలను జనసులినలరున్. 308

సీ. గొబ్బూరికులవార్ధికుముదాప్తుఁడౌనోబవిశ్వంభరాధీశవిభునికూర్మి
తనయయౌనరసింగమను నూరపాన్వయపావనుండగునోబపార్థివేంద్రు
పుత్త్రినోబమ్మనుబోచిరాట్చన్ననృపాఖ్యునిసుత జానకమ్మనిట్లు
వరుసతో మువ్వురఁబరిణయంబై వారలనికంబుననురక్తినాత్మగర్మ
తే. వర్తనకును సహాయులై వర్తిలంగ, నఖిలతరభోగభాగ్యంబులాసతీత్ర
యంబుతోఁగూడఁదాఁజాలననుభవించె, రామభూవరుకొండ్రాజు రామరాజు. 3.9

. రామారితిమ్మవిభుఁడు క, రామారిని రిపులఁదునుమ రంజిలు శుభసం
సూచకములుదోడ్తోడ సు, గీచయమునకును బ్రమోదవృద్ధిదలిర్పన్. 310

ఉ. నారద వింటె చిత్రమిది నారకవాసులుగాక దేవతా
వారిజగంధులంగలసి వత్తురు నన్గొలువంగ ధేనుసం
హారులు మ్లేచ్ఛులన్న వినుమా సురవల్లభయాజిభూమి రా
మారిపురీశుతిమ్మవిభునగ్రకరాసిని మ్రగ్గఁగాఁజుమీ. 311

. అన సురలెల్ల సంశయమె యబ్జజసంభవుమాట తథ్యమా

దుని మెడివేళ నాశ్వికునితోఁ దురగంబును మాఁటీనితో
డనుగరి ఖడ్గయుక్తము భటప్రకరంబును డొల్ల వాసవా. 312

చ. అనఘుఁడు రామభూవరుప్రియాత్మజుఁడాచినతిమ్మమానవేం
ద్రునిపటుశౌర్యమాశశివిరోచనభూధరతారకంబుగా
దినదినముం బ్రియంబునను దీవనలిచ్చిరియెల్ల దేవతల్
ఘనముగఁ బూలవాన జడిగాఁ గురియించిరియాడిరచ్చరల్. 313

ఉ. భూరిపరాక్రమోజ్జ్వలుఁడు పుణ్యచరిత్రుఁడు రామరాజు రా
మారిపురీశుతిమ్మనృపసోముని నిర్మలచారుకీర్తితో
సారెకు సాటిరాఁ బెనఁగి చాలక కాదె జడల్ధరించి గా
రీరమణుండు గప్పెను ధరిత్రియె యుంగఁగ వ్యాఘ్రచర్మమున్. 314

క. రామారితిమ్మరాజక, రాచక్రేశ్వరుఁడు పాణెరాజుప్రియసుతా
పోచమదేవిని మోద, ప్రాచుర్యము మదిఁ దలిర్పఁ బరిణయమయ్యెన్. 315

క. వీరాగ్రణి శ్రీరంగధ, రారమణుఁడు నదుల సాగరము లోఁగొనున
ట్లారూఢి రిపులఁ బొరిగొని, వారలసంపదలఁ గొనియె వాఁడని వేడ్కన్. 316

చ. అతిశయదానలోలుఁడు మహామహుఁడాశ్రితవజ్రపంజరుం
డతులితధర్మమార్గుఁ డభియాతిభయంకరమూర్తి యార్యస
మ్మతమతి రామభూవరకుమారకుఁడై నసిరంగరాజుతో
క్షితవరులెవ్వరీడ తనికిన్ మఱి సాటియతండెయౌ మహిన్. 317

శా. దక్షధ్వంసియు రామరాజమనుజాధ్యక్షేశు శ్రీరంగరా
జక్షోణీంద్రుఁడు నొక్కరూపరయనీ సర్వంసహానాథుసం
రక్షన్ శత్రుపురీహరత్వమున శౌర్యస్ఫూర్తి నట్లయ్యు య
జ్ఞక్షోభోగ్రుఁడ తండితండు మఘరక్షాదక్షుఁ డీక్షింపఁగన్. 318

మ. పరమప్రీతి వినమ్రులై సకలభూపాలుర్ధనంగొల్వఁగాఁ
గరుణాంభోనిధి రామభూవరునిరంగక్ష్మాతలాధీశుఁడు
ర్వరఁ బాలించె భగీరథున్ సగరునిన్ రామున్ ద్రిశంకూద్భవున్
బురుకుత్సున్ నయునంబరీషు భరతున్ బూరున్నలుం బోలుచున్. 319

మ. అలిరామేంద్ర నిరంగరాయమనుజాధ్యక్షేశుసత్కీర్తి ని
ర్మలకాంతుల్ని బిడంబుగాఁ గలయఁ బర్వంజూడఁ జెన్నొందెనీ

జలజాతప్రభవాండభాండము మహోశ్చర్యంబు సంధిల్లఁగాఁ
బొలుపొందంగ వివర్ణనీయమయి కర్పూరంపుబొట్టోయనన్. 320

తే. బాహుబలభీమ సంగ్రామపరశురామ, రామభూవరశ్రీరంగరాయవిభుని
భూరితేజోఽరుణద్యుతి భువనములరెఁ, బుష్పితాశోకభూరుహస్ఫూర్తిఁదనరి.

చ. కడిమిఁగిరీటిమాడ్కి నుతిఁగన్న సిరంగనృపాలుఁడు మే
ల్నడకలపోచిరాజరఘునాథనృపాలునికూర్మిపుత్రికన్
బుడమిపడంతిదాల్మినవఁ బోలినలక్ష్మమనువ్వరించెనిం
పడరఁగ రాఘవుండు జనకాత్మజఁ గైకొనుచంద మేర్పడన్. 322

సీ. అనవరతాభ్యుదయాభిలాషాశ్రితప్రతతికి ముంగొంగుపసిఁడియనఁగ
వినుతవిద్వత్కవివిసరంబులకు గృహస్థితదైవయాకామధేనువనఁగ
వంశానుగుణ్యప్రవర్తనులౌబంధువితతిపాలిటికల్పలతికయనఁగ
సరసాన్నదానదీక్షామహానిపుణత్వమునను గండసెయన్నపూర్ణయనఁగఁ

తే. జతురుదధివేష్టితావనీచక్రమునను, గలుగుసర్వసర్వంసహా తిలవరేణ్యా
కామినీజనసన్నుతుల్గాంచి మిగులఁ, దేజరిల్లినలక్ష్మమ్మదేవివెలన. 323

క. అతిగుణనిధిశ్రీరంగ, క్షితిపతికుదయించిరార్యకీర్తితసుగుణా
న్వితులు సుతులు పెదవేంకట, పతి చినవేంకటపతియనఁబరఁగనిరువురన్. 324

మ. అరిభూపాలకులాజి నిక్కముగ జాయూర్థంబు సక్రోధుఁడై
శరధింగట్టి కపర్ది నాఁగఁబురముల్ శౌర్యోన్నతిన్ద్రుంచుదా
శరథింగా మదినెంచి కాన్కలిడి యాజ్ఞానత్తులై కొల్తురా
కరుణాంభోనిధిఁబెద్దవేంకటపతిక్ష్మాపాలు నెల్లప్పుడున్. 325

శా. శ్రీరంగాధిపుపెద్దవేంకటనరిత్రీజానియుద్యద్భుజా
సారంబొప్పఁగ నేలెనెంతయునుగ్రుష్ణానేతుమధ్యక్షితిన్
దూరీభూతవిపత్సమానవవరస్తోమప్రచారంబుగా
నారూఢిన్ధరణీజనుల్సకలసౌఖ్యావాప్తి రాణింపఁగన్. 326

సీ. వనజనివాసానివాసకృపారసాసారాలవాలవీక్షణముచేత
శరసుధామందారశరదభ్రడిండీరధవళసత్కీర్తిసంతతులచేత
నలజయంతవసంతనలకూబరనితాంతవరరూపకలితవిస్ఫురణచేత
రణరంగచండదోర్బలదుర్జయాహితగణగర్వహరణవిక్రమముచేతఁ

తే. బుండరీకాక్షుఁదద్భ్రాతఁబుత్రుమిత్రుఁ, దెగడి ప్రహసించియుంజికించిధిక్కరించి

మించె నెంతయు శ్రీరంగమేదినీశు, పెద్దవేంకటపతిరాయభిదురపాణి. 327

క. గొబ్బూరివంశమణి హ, న్నిబ్బరగండఁడగు నోబనృపవరుసుతయౌ
నబ్బంగారమ్మను మది, నుబ్బుచుఁ బెదవేంకటపతియొనర వరించెన్. 328

క. అతనిసహోదరుఁ డబ్జా, హితకులకలశాబ్ధిపూర్ణహిమరుచి బుధస
మ్మతమతియౌ చినవేంకట, పతిగుణతతి నుతికలవియె ఫణిపతికైనన్. 329

తే. భక్తజనమందిరాంగణపారిజాత, మైన శ్రీవేంకటాచలాధ్యక్షుపగిది
భవ్యసాత్త్వికగుణగణభాజియగుచుఁ, జిన్నవేంకటపతిరాజసింహుఁ డలరు. 330

సీ. పెనుబాఁపకవణంబుఁ దినువారువము రౌతుపట్టిసోయగముతోఁ బరఁగువాఁడు
కలిమిచూపుమిటారికత్తియతోఁ బుట్టుపసమించు రంగుతో నెసఁగువాఁడు
తపసిరాకన్నాఁపఁదాలుపు చెలికానిదళమైన యీవితోఁ దనరువాఁడు
తాటిటెక్కెమువానితల్లినెయ్యపుఁబట్టి మించుబీరంబుతో మెఱయువాఁడు
తే. రాజమాత్రుండె శ్రీరంగరాజుచిన్న, వేంకటపతీశుఁ డఖిలపృథ్వీవరేంద్ర
మకుటమణిఘృణిసువిరాజమానపాద, పద్ముఁ డాశ్రితజనపద్మభాస్కరుండు. 331

సీ. మొగమియ్యకను బరాఙ్ముఖుఁడైనఁ గదియఁబోకను జిరాయువు గల్గఁ గానొనర్చుఁ
గని కరమ్ములు మోడ్చఁ గనికరమ్మునఁ బ్రోచి ముదముతో సకలసంపదలఁ గూర్చుఁ
గలసియుండకను జఘలమతి నాగవాసముఁ జేర నిజవధూజనులఁ జేర్చు
నెదురుగా రాఁ గ్రుచ్చి యెత్తి వేగమె వేల్పుపొలఁతులపాలిండ్లఁ బొందఁ దార్చు
తే. నకులవీరప్రతాపరాజాధిరాజ, రాజపరమేశబిరుదవిరాజమానుఁ
డైన చినవేంకటేంద్రు బాహాసిపుత్రి, చిత్రమిదియని బుధులు చర్చింతు రెపుడు.

సీ. ఒకనాఁడు చినవేంకటోర్వీశ్వరుఁడు విరూపాక్షుసేవాసక్తి నచ్చటికిని
నరిగి క్రమ్మఱఁ ద్రోవయందొక్కయెడ రామసుత్రాముఁడును బొడమూపినట్లు
తోఁచిన భయము సంతోషంబుఁ బెనఁగొనఁ బ్రకటరోమాంచకంచుకితగాత్రుఁ
డై వచ్చి నెమ్మది హరిఁ దల్చి నిద్రింప డంబైనమణికిరీటంబుఁ దాల్చి
ఆ. దివ్యభూషణములు దివ్యమాల్యంబులు, దివ్యగంధములును దివ్యవస్త్ర
ములును దాల్చి దివ్యమూర్తితోఁ గోదండ, పాణియైన రామభద్రుఁ డెదుట. 333

క. వచ్చుటు నిల్చినఁ గనుఁగొని, యచ్చెరువీ రాజిచటికి నరుదెంచుటయే
మిచ్చను దలఁచుకనో యది, యొచ్చెము పడనీక దాని నొనఁగూర్పఁ దగున్. 334

సీ. అనుచు నుదుపోయు నంతనో చినవేంకటాధిప నీవు పంపాధినాథుఁ
డగు నీశు భజియించి యరుదేరఁ ద్రోవను బొడనూపినట్టి యాభూమిభుజుఁడ

నేను నాపేరు నీకెఱిఁగింతుఁ గోదండపాణియౌ శ్రీరామభద్రుఁ డండ్రు
మమ్ము భూజనులన్నమాట విన్నంతన నిటలతటాగ్రసంఘటితహస్త
తే. కమలుఁడై దండములఁ బెట్టి కనకపీఠ, మందు నాసీనుఁ గాఁ జేసి యాగమోక్త
సరణిఁ బూజించి తత్పాదజలజములకు, భక్తిఁ బ్రణమిల్లి యిట్లని ప్రణుతిఁ జేసె 335

## చక్రబంధము.

శా. భవ్యా కోసలసూతినందన రమాభావేందుసారంగకా
క్రవ్యాదప్రహరప్రవీణ నయరక్షాగణ్య నామాంకితా
దివ్యాండప్రచయప్రభావనరథా దీనస్పృహాకంటకా
కావ్యారంభహితక్రమా విదితనాకారీ శ్రితానందకా. 336

## నాగబంధము.

వ. పరమదయాకరా రవిజభంజన బోధవిహారభాసురా
కరధృతచాప నీరజజకంజసురప్రకరాశనాంబుజా
మరధరణీజహారశరమారవిపక్షపయోదసారకీ
ర్తిరమశతావిహార ధరధీర వసుప్రజనూతిపావకా. 337

## గోమూత్రికాబంధము.

క. మురహర ధృతగిరివర పర, వరద రమాధీశ గోప వర్ణితచరణా
దరధర నుత కరివర సుర, వరద రసాధీన గోప వందితచరణా. 338

## చతుశ్చరణగర్భకందము.

గిరిధర కమలాధ్యక్షా, సరసీరుహపత్త్రనయన శరనిధిశయనా
మురహర సన్నుతనామా, కరుణాకర నరసఖ హరి కరివరరక్షా. 339

1. శరనిధిశయనా మురహర, సరసీరుహపత్త్రనయన సన్నుతనామా
కరివరరక్షా గిరిధర, కరుణాకర నరసఖ హరి కమలాధ్యక్షా. 340

2. శరనిధిశయనా గిరిధర, సరసీరుహపత్త్రనయన సన్నుతనామా
కరివరరక్షా కరుణా, కర నరసఖ హరి మురహర కమలాధ్యక్షా. 341

## ద్వికందగర్భక్రౌంచపదవృత్తము.

ధారుణిపారావారసుతారత్నములిరుగడల సతతమును బాదాం
భోరుహసేవల్గూరిమిఁ బూరంబుగ నెదఁ బనుచి పొలుపుగఁ జేయన్
జేరి సురల్గైవారముచే రంజిలు నటులొనరిచి చెలఁగఁగ మండే
నీరదవర్ణున్ శౌరిని వైరివ్రజదమను జగదవనునినిఁ గొల్తున్. 342

క. ధారుణిపారావారసు, తారత్నములిరుగడల సతతమును బాదాం
భోరుహసేవల్గూరిమిఁ, బూరంబుగ నెదలనునిచి పొలుపుగఁజేయన్. 343

క. చేరి సురగ్గైవారము, చే రంజిలునట్టులొనరిచి చెలఁగఁగనుండే
వారిదవర్ణున్ శౌరిని, వైరివ్రజదమను జగదవనునినిగొల్తున్. 344

## నవగ్రహాష్టదిక్పాలకదశావతారనామగర్భకందము.

హరి శశి కుజ బుధ గురు కవి, హరిసుత తమ కేతు హరియమాప్రపకధనే
శ్వరశంకర శరచరయుగ, కిరి నరహరి వటు త్రిరామ కితవ ముఖహయా. 345

## దండకము.

శ్రీజానకీనిస్తులోరోజ కాశ్మీరకస్తూరికాగంధపంకాంకితోరస్థలా, నిర్జరారాతి
వంశాటవీదాహదావానలా, కోటిసూర్యప్రకాశా, త్రిలోకేశ, విశ్వస్వరూపా,
శుభాలాప, గోరాజహంసాభ్రమాతంగివాహాదిగీర్వాణసందోహకోటీరకోటిస్ఫుటా
నర్ఘ్యరత్నప్రభాకీర్ణపాదారవిందా, సునాభీసరోజాతగర్భార్భకాకారరాజచ్ఛతా
నంద, గౌరీశవాగీశనాకేశభోగీశులైనన్ భవద్దివ్యచారిత్రముల్సన్నుతుల్సేయఁగాఁ
జాలరే నెంతవాఁడన్ మహామూఢచిత్తుండ మత్తుండనైనన్ భవత్కృత్యముల్సన్ను
తుల్సేసెదం జిత్తమందుంచి రక్షింపవే, దేవ, మీనాకృతిందాల్చి, సుప్తాబ్జసంజాత
నిశ్శ్వాసవేదాపహర్త్రాసురారాతి మర్దించి యాబ్రహ్మసద్వేదముల్గ్రమ్మఱంజేర్పవే,
కచ్ఛపాకారముంబూని పాథోధినిర్మగ్నమంథాచలేంద్రంబు వెన్నాఁగి దూర్వాస
శాపాహతాఖండలశ్రీపునర్లాభముంజేయవే, ఘృష్టిరూపంబుచేఁ జండబాహాబలో
దగ్రహేమాక్షరక్షఃపతిం ద్రుంచి పాథోనిమజ్జద్ధరాకాంతనత్యంతసంతోషిత
స్వాంతగాఁజేసి శృంగాగ్రభాగంబునన్నిల్పవే, మర్త్యసింహుండవై స్తంభమం
దుద్భవంబంది సాయంసమారంభకాలంబునందూరుయుగ్మస్థలాసాదితాదిత్యవిద్వేషి
రాట్కుక్షివిచ్ఛేదనోత్సాహముంజూపి నీబంటుపంతంబుఁ జెల్లింపవే, గుజ్జుపా
లుండవై నిర్జితామర్త్యనాథప్రకర్షానుమోదాత్ముఁడైనట్టివైరోచనిన్మెట్టి జీర్ణేంద్ర
రాజ్యప్రతిష్ఠాపనాచార్యవిఖ్యాతినిం జెందవే, రేణుకాగర్భపేటీలసద్రత్నరామావ
తారంబుచే సాహసాధాతిశౌర్యోగ్రరాజత్సహస్రోరుదోర్దుష్ఖ్యరాజన్య సందోహ
ముం జెండి సర్వంసహాచక్రమాద్యంతముంగశ్యపబ్రహ్మకుం దానరూపంబుగా నీ
యవే, రామభద్రాఖ్యచే గాధిపుత్రుండు గావించుయాగావనార్థంబు వేంచేసి
యాతాటకానామఘోరాచరిం బుత్రియుక్తంబుగాఁ ద్రుంచి మారీచునిన్వారిధి
న్ముంచి పాషాణరూపంబుచేనున్నమౌనీంద్రుయోషాలలామంబు దోషంబులెల్లన్ని

మేషంబులో నంఘ్రిరేణుప్రభావంబుచేతం దొలంగించి చంచద్గుణోపేతకై లోకవిఖ్యాతకై విస్ఫురద్భాగ్యసంభూతకై సీతకై దర్పకారాతికోదండదండంబు వేదండ మంభోజకాండంబు ఖండించుచందంబునందుంచి భూపుత్త్రినిన్వేడ్కతోఁ బెండ్లియై చాల దోశ్చండగర్వాతిరేకోన్నతిన్మించు నాజామదగ్న్యున్నివారించి యాకేకయేశాత్మజామోదమౌనట్లుగాఁ దండ్రిసత్యంబుఁ బాలించి రాజ్యాభిలాషంబుఁ జాలించి ఘోరాపరాధున్విరాధుం బడంగూల్చి నానామృగాకీర్ణమౌదండకారణ్యభూమిం బ్రవేశించి మౌనీంద్రవిద్వేషణుం దూషణుం ద్రుంచి మాయాకురంగాకృతౌనీచు మారీచు ఖండించి పాదోరుసంఘట్టనక్షుణ్ణనానావిధగ్రావు సుగ్రీవునింబంటుగా నేలి సంగ్రామరంగస్థలీజృంభణోద్యద్భుజాశాలి నావాలినాక్రమ్మునం గూలఁగా నేసి బాణాగ్నికీలంబయోరాశినింకించి భాస్వద్యశోహేతువా సేతువుంగట్టి నిశ్శంక లంకాపురింజుట్టి మాయావులున్యుద్ధచాతుర్యసంపన్నులున్ గర్వదుర్వారులున్ దేవతావ్రాతసంహారులున్నైనయాకుంభకర్ణాదిరాత్రించరాధీశులం ద్రుంచి యాఖండలస్యందనం బెక్కి గుర్వాహవగర్వోన్నతిన్ లోకవిద్రావణున్ రావణుం గూల్చి లంకాపురాధీశుఁగాఁ గుంభకర్ణానుజుం బట్టముంగట్టి వైశ్వానరాభీలకీలాప్రవేశక్రియాత్యంతశుద్ధాత్మయైనట్టి ధాత్రీసుతన్వేడ్కఁ జేపట్టి రాత్రించరుల్వానరుల్గొల్వఁగాఁ బుష్పకం బెక్కి యక్కైకయానందనాలంకృతంబౌనయోధ్యాపురంబుం బ్రవేశించి కౌసల్యకుం గైకకున్ శ్రీసుమిత్రామహాదేవికిన్ భక్తితో దండముల్వెట్టి మిత్రానుజాచార్యసామంతమంత్రిక్షమానాయకుల్సంతసంబందఁ బట్టాభిషిక్తుండవై సీతతోఁ గూడ సౌభాగ్యభోగాభివృద్ధిం బ్రవర్ధిల్లవే, రోహిణీపుత్రరామస్వరూపంబుచే లాంగలోద్ధూతనాగాధిభూపట్టణాకారరేఖున్విజృంభించి భీతాత్ముఁడౌ కౌరవేంద్రుం గృపం బ్రోవవే, బుద్ధభావంబుచే నాసురీమానభంగంబుఁ గావించి ఫాలాక్షునింద్రాదిబృందారకానీకసంస్తుత్యశశ్వజ్జయశ్రీ నిరింపన్నియోగింపవే, కల్కివై ధర్మమార్గేతరోర్వీజనవ్రాతముం ద్రుంచియుత్పన్నవర్ణాశ్రమాచారసద్వర్తనోద్ధారకత్వంబునం బొల్చు నాహ్లాదభావాప్రమేయుండవౌనట్టి దేవుండవున్నీవకావే, త్రిలోకంబులన్ లీలఁ బుట్టింప రక్షింప సంహారముం జేయఁగాఁ జాలియున్నట్టి మూర్తిత్రయాకారసంభూతిహేతు స్వయంవ్యక్తమాయాపరబ్రహ్మము న్నీవకావే, భుజంగేంద్రతల్పా, ప్రపన్నాఖిలాపద్వరానల్పకల్పా, భవద్భక్తి నాకుం బ్రసాదించి రక్షింపవే, భానువంశాబ్ధిరాకాసుధాధామ, దైత్యేంద్రహృద్భీమ, నీలాంబుదశ్యామ, కోదండరామా, నమస్తే నమస్తే నమస్తే నమః. 346

తే. అనుచు వినుతింపనారాముఁడనియెఁ జిన్న, వేంకటపతిక్షమానాథ వినుము నీదు
పుత్త్రుఁడగువీర వేంకటభూవరునకు, నగ్రసుతుఁ డుద్భవిల్లు మదంశమునను. 347

క. అనియానతిచ్చి రాముఁడు, గనుఁగొననంతర్హితుండుగా మేల్కనియా
చినవేంకటపతి బాంధవ, జనములకావిధముఁ దెలిపి సంతోషమునన్. 348

క. చినవేంకటపతినృపమణి, కనకప్రాకారముఖ్యకైంకర్యంబుల్
జనులెన్నఁగ మోదంబొ, ప్పనొనర్చి భజించె రామభద్రస్వామిన్. 349

ఉ. ఈమహిఁ జిన్నవేంకటపతీశ్వరుఁడర్థులఁ జెందఁ జేయు ము
క్తామితహారవాహమదహస్తి సువర్ణముఖోరుసంపదల్
ప్రేమను శత్రుకోటికిని భీషణరేఖనుగల్గఁజేయు ము
క్తామితహారవాహమదహస్తిసువర్ణముఖోరుసంపదల్. 350

సీ. ఏధన్యునిజధామమిందిరాకాంతకు మానితకేళికామందిరంబు
ఏఘనుభుజపీఠమీమహీకామోదకరరమణీయసౌఖ్యప్రదంబు
ఏభూభుజునిజిహ్వ యాభారతికి నెప్డుఁ గమనీయనృత్తరంగస్థలంబు
ఏకాంతుకరుణావిలోకనంబాశ్రితగురుజనములకు ముంగొంగుపసిఁడి
తే. యతఁడు సామాన్యుఁడే సగరాంబరీష, భరతనలరంతిహైహయప్రముఖపూర్వ
రాజచర్యుండు శ్రీరంగరాజచంద్రు, చిన్నవేంకటపతినృపశేఖరుండు. 351

సీ. జంటమొగంబులసామిముద్దులకుఱ్ఱతల్లిగేస్తుఁడు సిగఁదాల్చుపువ్వు
పడిగలజంకతత్తడి నెక్కు నెఱరాతుపారుగూరిదొరకును బొరుగుటెంగి
నిరునాలుమేనుల నెసఁగువేలుపుతండ్రిపట్టిపట్టపుజలుపుంజ మెకముఁ
దనబిడ్డనుజూపులనుగాచుకొనుడాలుగలమేటితల్లినిఁ గన్నవాని
తే. నక్కఁజఱచియునక్కొంగి చెక్కిలడఁచి, కలఁచి నీరుగఁజేసి నల్లడలయందుఁ
గడిమి నెంతయుఁ జెలఁగుచుఁ గలయ మెలఁగి, యుబ్బుఁజిన్నవేంకటపతిగబ్బియసము.

క. చినవేంకటపతినరవరు, ఘననిర్మలతేజమలరుఁ గర్ణాటమహీ
వనజాయతాక్షి మైఁబూ, సినయభినవకుంకుమంబు చెలువుదలిర్పన్. 353

మ. పరమప్రీతి జిలెళ్లనారపమహీపాలేశుసత్పుత్త్రుఁడా
మరసాక్షుండిరువెంగళాంబనరసింహాకైకశూరుండు భా
సురధైర్యుండగుచిన్నవేంకటపతిక్షోణీంద్రుఁడుద్వాహము
ల్యొగ్య రమన్ఛన్నగరాజతల్పుఁడు వివాహంబైనచందంబునన్. 354

క. మతిచేఁ గమనీయతరా, కృతిచేఁ బతిభక్తిచేనొగిందగనాభా

రతికిన్ రతికిని సతికిని, నతిశయమయినతిరువెంగళాంబికయందున్. 355

మ. జననంబందిరి చిన్నవేంకటమహీశస్వామికిన్నందనుల్
ఘనచారిత్రుఁడు తిర్మలాధిపుఁడు సంగ్రామార్జునుండంచు భూ
జనసంస్తుత్యతఁ గాంచువేంకటపతిక్ష్మాజానియున్ధర్మవ
ర్తన రాణించుసిరంగరాయమనుజాధ్యక్షుఁడన్మువ్వురున్. 356

క. కృతి మెఱుఁగుటయరి శరణన, హితమతి మనుచుట కవీంద్రులేమడిగిన స
మ్మతినిచ్చుట చినవేంకట, పతితిరుమలనృపతికెప్పుడుఁ బాయనిగుణముల్. 357

సీ. గోపాలమూర్తియాగోపాలభూపాలచంద్రుఁడు దనదురాజ్యంబునకును
బట్టంబుఁగట్టిన బాహాబలస్ఫూర్తి మెఱసి ధర్మంబున ధరణినేలి
వర్ణాశ్రమంబుల వరుసతో నడపుచు నీతిబాధలులేక ప్రీతి జనులు
సంపదలనుదేల సవనోత్సవంబులు దఱుచుగానూరూర జఱుగుచుండ

తే. సకలనరనాయకులుగనుసన్నమెలఁగఁ, దనకు వేలూరు నిజరాజధాని గాఁగఁ
బరఁగెఁగడుఁజిన్నవేంకటపతికుమార, రత్నమైనట్టిశ్రీరంగరాయమౌళి. 358

క. దిమ్మరివైరులఁబోరిగొని, కొమ్మనుచునుబసిఁడి వేలకొలఁదులుఁగా ని
త్యమ్మునుగవులకునొసఁగుట, నిమ్మగు శ్రీరంగమానవేంద్రునిగుణముల్. 359

సీ. ధాటీనిరాఘాటఘోటకోద్ధుతపాంసుపటలంబు నల్లడఁబాఱఁజల్లి
బంధురతరగంధసింధురనికరశీకరము నిబ్బరముగఁజిలికి చిలికి
వితతదోర్బలవిజృంభితయోధశరనికరకాండాహతులఁజాల బెండుపఱిచి
వీరరసావేశఘోరసద్భటనినదఘట్టనను జాపమ్ముట్టువెట్టి

తే. యుదయగిరిదండవెలుఁగొందుచుండుకుతుప,శాహుబలదర్పదనహుతాశనునినడఁచి
వినుతిఁగాంచెను సకలభూజనులచేత, రమ్యగుణహారి శ్రీరంగరాయశౌరి. 360

సీ. మామమామగువానిమామనుగన్నయ్యయ్యకూరిమిమనుమనికొడుకుకొడుకు
కొండలదొరపట్టి కొడుకు తేజీమేఁతమేఁతమూలగువాని మేటితాత
తొలుఁబల్కుగుత్తాలఁదోలెడునాతనిమనుమనిమనుమనిపగతుసుతుఁడు
బిడ్డగేస్తునితండ్రిబిడ్డనిమామన్నకొడుకునుక్కడఁచినకడిఁదిమగఁడు

తే. దానగుణమున వితతప్రతాపమునను, జక్కఁదనమునసహాయసాహసమున
సాటియగుఁగాక యితరులు సాటియెటులఁ, జేయఁగావచ్చు శ్రీరంగరాయమణికి.

క. శ్రీరంగరాయశశి గొబ్బూరికులుండైనవెంగళోర్వీశుతనూ
జారత్నముఁబాపమ్మన, పారవిభవమలరఁగా వివాహంబయ్యెన్. 362

సీ. మఱి పోచిరాట్కులమండనుండగు వెంగభూనాయకాగ్రణిపుత్రియైన
రాఘునమ్మనుబోచిరాజువేంకటరాజుతనయవెంగమ్మనుద్వాహమయ్యె
నాసతీత్రయముననురక్తితో సర్వకర్మసహాయమై తగ భజింప
నతిశయభోగభాగ్యాభివృద్ధినిఁజాల రాణించి ధర్మమార్గప్రచారి
తే. యనుచు విద్వజ్జనంబులు వినుతిసేయ, వెలసె నెంతయునసహాయవిక్రమాఢ్యుఁ
డారవీటిపురాధీశుఁడైనచిన్న, వేంకటపతీంద్రుశ్రీరంగవిభుఁడు మిగుల. 363

సీ. దరముతోఁజీనికస్వరముతో ఘనశికంధరముతోఁజోడుగాఁదనర మెలఁగి
శరముతోఁదుహినభూధరముతో ఋక్షవిసరముతోఁబ్రతియనఁజాల మెఱసి
హారులతో ముత్యపుసరులతో దైవతతరులతోననురక్తిఁదగనొనర్చి
రాజుతోనింద్రేభరాజుతోఁబన్నగరాజుతో నెనయగురంగుఁబూని
తే. దశదిశాత్యంతపరిపూర్ణతను వహించి, రహిని వెలసెను శ్రీరంగరాయమౌళి
ధాళధళ్యప్రభాసురానవళకీర్తి, కవిజనాధీశవర్ణనగడుఁజెలంగ. 364

క. ఇట్టిగుణంబులుఁగలతోఁ, బుట్టువులనురక్తిఁగొలువఁబోరుల రిపులన్
గొట్టి మనుమార్గచర్యను, బట్టగుచును వేంకటేశ పార్థివుఁ డలరున్. 365

చ. కుటిలవిరోధిరాజమదకుంజరసింహకిశోరమూర్తి వి
స్ఫుటహరిభక్తితత్పరుఁడు పూరుకులీనుఁడు ధర్మవేది వేం
కటపతిరాయశేఖరుఁడగణ్యగుణాకరుఁడమ్మహాత్మునిం
బటుమతియాబృహస్పతికిఁబన్నగభర్తకునెన్న శక్యమే. 366

సీ. తా భుజింపఁగలేక తలిగ వడ్డించినయన్నంబు సతతంబు నమ్ముకొనుట
పారి బీదతనమునవోరులకుఁదనసొమ్ము పుడికమాత్రంబైనఁబొరయనీక
యొకటికి రెండుగానొగి వడ్డి రాఁబట్టి ధనమెల్ల మూలను దాఁచుకొనుట
తనుఁజూపవచ్చినఁగనికరంబును లేక కలసొమ్ములెల్లను గిలుబుకొనుట
తే. మానె నేనియు నెనవచ్చు మానితాన్న, దానవితరణభోగప్రజానురంజ
నపరుఁడైనట్టిచినవేంకటపతి వేంక, టపతికినినలశ్రీవేంకటపతియరయ. 367

చ. జలరుహబాంధవాత్మజుఁడొసంగును రేఁపటిపూఁటభక్తితో
గలువలరాయఁడిచ్చునొడికంబుగ మాఁపటివేళ వేడ్కచే
చెలిమినొసంగు వేంకటపతీంద్రుఁడు రేఁపును మాఁపునర్థిన
ర్థులకు సమస్తవస్తువులుదోరముగాననివార్యదాతృతన్. 36

సీ. వైభవంబున నెనవచ్చును మడుఁగులో భీతి డాఁగకయున్న భిదురపాణి
సౌందర్యమునఁ గొంత సరియగుఁ బురహరుకనువెచ్చఁగనకున్న మనసిజుండు
గాంభీర్యమున నీడు ఘనరాఘవాశుగాగ్రమున నిల్వక యున్నఁ గంధిరాజు
కాంతినిఁ బ్రతియౌ మఖస్వాంసికపహతిఁ గందుఁ జెందకయున్నఁ గమలవైరి
తే. యనుచుఁ జతురంబునిధివేష్టితాసనీక, సకలకవిజననికరంబులభినుతింప
నలరునార్వీటిపురవరాధ్యక్షుఁ డైన, రణజయవిహారి వేంకటరాయశౌరి. 369

చ. ఇననిభుఁ డైన వేంకటపతీశుఁడు దక్షిణబాహుపీఠిని
పెనయ వహింప భూభరమహీనపరాక్రమశేషు నిండె భూ
జనములు సర్వసంపదలఁ బాయఁగఁ గల్గి సుఖింప నాగకూ
ర్మనగవరాహభోగులకు మానుగ నూఱటగల్గె నెంతయున్. 370

సీ. ఆగమోక్తసుదక్షిణాన్వితముగఁ జేయు సరవితో దశవశసవనములను
బహ్వష్ములను భూసుపర్వులకిచ్చునదలుచుగా బహువిధదానములను
ఆరూఢిగాఁ గనూయానను బెట్టించు సత్రసోపేతాన్నసత్రములను
గనకగోపురవప్రకలితంబుగా వేడ్కఁ గట్టించు దేవతాగారములను
తే. రాజమాత్రుండె ధరణీపురాహబిరుద, వినుతుఁ డాత్రేయగోత్రపవిత్రుఁ డౌన
తారకోటీనరుగ్భాగ్రిజితాంఘ్రితామ, ఘనుఁడు వేంకటపతిరాయరాజమౌళి. 371

సీ. నెఱయాఁగి బలుఁ జెట్టునిగనిగల్గడునవ్వి రెక్కలదొరరంగు స్రుక్కఁజేసి
జగడాలముని కౌనిఁ జిగిఁ గేరి వినువాఁక చాయలనిలునటుఁ బాయఁ ద్రోచి
పలుకుఁ జిలుకలకొల్కి తళుకులగిమి పుంది యం దలమై సిరిఁ గొంచెపఱచి
తెరగంటిరొకిమీని తేజిసొంపును గెల్చి పాపరాయనిపసఁ బాఱఁదోలి
తే. ప్రొద్దుకడవేళఁ బూచునాపూవుతావి, కలికులుట్టించి చావంత యనువుఁ దగడి
కడిమి నలుగడలను వేంకటపతీశు, నసము మిగుల మేలనఁగఁ జెన్నలరుమంచు. 372

ఉ. ఇమ్మహియందు వేంకటపతీంద్రునభోమణిసాటియౌ ప్రతా
పమ్మనివార్యతన్నలఁగి బంధనమై నలుదిక్కులెల్లనుం
గ్రమ్మిన దుర్జయాహితధరావరులెల్లను భీతిచే దివాం
ధమ్ములఁ బోలి డాఁగిరి మదంబులుపెంగి గుహాంతరంబులన్. 373

సీ. రాజాధిరాజవీరప్రతాపాంకుఁడౌ వేంకటపతిరాయవిభుఁడు వేడ్క
నూరపకృష్ణపక్షోణీశుసత్పుత్త్రి నప్పలాంబను నమరాద్రిధైర్యుఁ
డనఘుండు పోచిరాజాన్వయుండగురఘునాథరాజేంద్రునినందనలను
విమలసచ్చారిత్ర వెంగమ్మ పద్మాయతాక్షి కోనేటమ్మయనని రువుర

తే. నొగి వరించెను సతులను ముగురియందు, నశ్వినియునాదియగుతారకాళిలో ర
మణునియనురక్తిఁ గాంచురోహిణివిధమున, నలరుఁబతిమన్ననలనప్పలాంబ మిగుల.

ఉ. అంబుధిరుద్ధభూస్థలినినారసి చూచిన దీటు లేదుగా
యంబుదవేణులందు సుగుణావళిచేతను యానధూతకా
దంబకుఁబోషితాశ్రితకదంబకునాస్యనిరస్తశీతరు
గ్బింబకు భద్రదప్రథితకీర్తివిడంబకునప్పలాంబకున్. 375

క. దీనులను బ్రోచు సతతము, నూనకృపారసనిగుంభితోజ్జ్వలమతియై
జానుగనిల వేంకటపతి, భూనాథునియప్పలాంబ బుధనుతులెసఁగన్. 376

సీ. తాలిమిచే భూతధాత్రికిఁ బ్రతివచ్చు వాగ్వైఖరిని సరస్వతికి హెచ్చు
సత్యవాక్పరిధిని సత్యభామకునీడు వైభవంబుననిందిరవనితజోడు
మాంగల్యమున సర్వమంగళకెనఁజాలు భద్రసంపదఁగల్మి పడఁతిఁబోలు
నన్నదానంబుననన్నపూర్ణకుసాటి పతిభక్తినలయరుంధతికిఁబోటి
తే. యనఁగఁబొగడొందునుభయాన్వయంబులకును, వన్నెవాసియుఁగలుగంగవసుధనార
వీటివేంకటపతిపృథివీవరాప్తు, తాంశునర్ధాంగలక్ష్మియౌనప్పలాంబ. 377

క. వారిరువురుగనిరనఘుల, వీరాగ్రణి రామరాజవిభునిన్ శౌర్యో
దారుండనఁదగుతిమ్మను, ధారమణుని వేంకటాద్రిరాజబిడౌజున్. 378

తే. ఘనతరాన్యోన్యమోదంబుగలుగ మెలఁగి, చెలఁగుచుండెడియారాజసింహవరుల
యన్నదమ్ములసౌభ్రాత్రమభినుతింపఁ, జిలువరాయనికైనను నలవియవునె. 379

సీ. కమలాతనూభవాకారరేఖనుబోల్చి సతులనుమోహవసతులఁజేయుఁ
గదనగాండీవివిఖ్యాతిని రాణించి పరులను సురవధూవరులఁజేయు
దేవతాభూజవితీర్ణినిఁదనరుచుఁగవులసంపన్నహర్మ్యులఁజేయు
వినుతసద్ధర్మప్రవీణత్వమున మించి జనులను సన్మోదఘనులఁజేయు
తే. ననుచు వినుతింతురఖిలనరాధిపేంద్ర, సభలనెప్పుడు సత్కవీశ్వరులు వేడ్క
లలరనెంతయునార్వీటికులపవిత్రుఁ, డైనవేంకటపతినృపాలాఢ్యునెలమి. 380

సీ. ఘనధర్మసద్గుణకమనీయమగుటనో పలుకు రామామోఘబాణమయ్యె
వర్ణితమిత్రానువర్తనంబవుటనో పృథివీధరణమింపురేఖయయ్యె
ఘోరారికర్ణవిదారణంబగుటనో సాహసంబింద్రజోత్సాహమయ్యె
వరవర్ణినీమనోహారవృత్తియగుటనో సోయగంబు సుమాస్త్రుఛాయయయ్యె
తే. నార పరిపంథిరాజగర్వాంధకార, నలినహితుఁడైనతిమ్మభూనాయకునకు

ననుచుఁ బొగడుదురఖిలనృపామృతాంశు,లహరహంబును ముదితాత్ములగుచుఁ జెలఁగి.

క. రాముసకు లక్ష్మణుఁడు సు,త్రామునకుఁ ద్రివిక్రమాభిధానుండట్లా
రామాధిపునకుఁదిమ్మధ, రామండలపతి మహోనురక్తిగ మెలఁగున్. 382

సీ. కరుణారసార్ద్రితసరినచ్చునొక్కింత పదినూఱు చేతుఁలఁ బరఁగువాఁడు
వైభవంబునఁ బ్రతివచ్చునుబరికింపనొకహస్రముకన్నులొనరువాఁడు
క్ష్మాభారభరణదక్షత నెనయఁగుఁ జూడ దశశతాననములఁదనరువాఁడు
పరమతేజంబునఁ బాటియౌనెన్నంగ వేయికరంబుల వెలయువాఁడు

తే. గాకయితరులనెటుదీటుగా నుతింప, వచ్చు మనుమార్గచరితుఁ డవార్యబాహు[ను.
శౌర్యుఁ డంభోధిగాంభీర్యుఁ డార్యవినుతుఁ, డయిన యార్వీటితిమ్మభూపాధ్యునకు

చ. పొడఁగననర్థికర్థమిడి పోయెదమూరికినంచుఁ దెప్పని
పృథ్వి దెకదయిచ్చినాపునక భూరికృపామతి వస్తువాహనా
లుడుగరలిచ్చియన్నపుసుగుణోజ్జ్వలుఁ డార్వీటితిమ్మలేంద్రుఁడీ
నడవడిగల్గునే శిబినృనాథదధీచులకున్ననిస్సృహిన్. 384

## ప్ర హ ర ణ క లి త వృ త్త ము.

చటులభుజబలశ్వసనజుఁడగునా, ర్వీటితిరుమలభూవిభుపటుహము ది
క్తటములవియనుద్ధతిచనఁదనయుం, తటగయపడి శాత్రవులిడుదురరిన్. 3·6

## ఫ ల స ద స వృ త్త ము.

నిటలతటమున బొమలునిచి కలనియందా, ర్వీటితిరుమలనృపశశి వితతకరహేతి
స్ఫుటతఁ బఱపనరితతిపాలఁ లెడలంతం,తట వనములకుఁ జనిందడఁ బడుచు భీతిన్.

## కుసుమితలతావేల్లితవృత్తము.

క్షోణిపై ఖడ్గాళిద్యుతితతి మిణుంగుర్లుగాఁ గానివంచున్
గోపోద్రేకప్రాకటమదరిపుక్షోణిపాలాంబురుటోఘ
శ్రీపాలుల్వీడఁగ నలందెసలంబర్వియార్వీటితిమ్మ.
క్ష్మాపాలాంభోజహితుబులపరాగింబు ధ్వాంతంబుఁ జేయున్. 387

సీ. పలుమాఱు వైరిభూపాలురరాజ్యసప్తాంగముల్గట్టల్క నాక్రమించు
జగజెట్టివలెఁ జేరి జలకట్టిగతిఁ మాటి చలపట్టి బుసకొట్టి చప్పరించుఁ
బుసమిదాలువుపేయిపడగల్గాపంగ నడి మెట్టుఁ గిలకొట్టు బడలుపడఁగఁ
గడిమోరతోఁ పునూఁకుడుఁ జేసి కోటాడి కొమ్ములనెగఁదట్టుఁ జిమ్మిచిమ్మి

తే. కలఁచి కబళించి కడువడి బలిమి మించి, గెలిచియార్వీటి వేంకటక్షితిపుతిర్మ
లేంద్రుఁడిలమూఁపునను నిల్పియిరవుకొనియె, రాజనుతులొప్ప ధరణీవరాహమూర్తి.

మ. అనిలోనార్వీటితిర్మలాధిపుమహోగ్రాసిన్ రిపుల్మ్రగ్గి పా
వనలీలన్ రవి దాఁటి దేవగణికావాటింజరించిందుప్రప
జ్ఞనుగూర్చుండిన మోవిఁగంటిఁగని లజ్జన్ రంభ కన్వాల్చెనా
ననమున్వంచె ఘృతాచి పూనిరి సునందామేనకల్మౌనముల్. 389

శా. భీతిన్నన్యపరాఙ్ముఖాహితవరుల్భీమాటవీవాసులై
శీతోష్ణాదులకోర్చి యోగనిరతిన్ క్షీరానిలాహారులై
చేతోజారి భజించుచుంజటిలులై చిత్రంబు సంరక్ష సం
ప్రీతింగాంతురు రాయలాధిపునిమాశ్రీతిర్మలాధీశు చేన్. 390

తే. చేఁదు దిగ మ్రింగి నొలఁదులఁజేర్చినట్టి, హరునివలెనాశ్రితావగుణాళినడఁచి
గుణమొకింతయుఁగలిగినఁగొని గ్రహించు, రాయలాధిపుతిరుమలరాయశౌరి. 391

సీ. పరకాంతలఁగన్నెత్తి భావించి చూడఁడు పరధనంబుఁదృణంబుపగిదిఁజూచుఁ
బరులదూషింపఁడెప్పటికిని గల్లైన బొంకు నాలికయందుఁ బొసఁగనీఁడు
న్యాయమార్గమొకింత పాయ వర్తిల్లఁడు ధర్మమెన్నాళ్లనైనఁదప్పఁబోఁడు
చాడిఁజెప్పిన విననీఁడు సెన్నఁటికినొకింతైనఁగోపంబుపొంతఁజనఁడు
తే. విడువఁడాశ్రితరక్షయే వేళనైన, ధరనలనృగరామభూమిపతులఁబోలి
మేలిగోనములమేలిమి మెలఁగ మరిగి, భానునిభుఁడైనతిరుమలపార్థివుండు. 392

చ. సరసకళాప్రవీణుఁడతిసాహసుఁడంచితధర్మవేది భూ
సురవరపోషి దాని రిపుసూదనుఁడద్వయతానువర్తియీ
శ్వరభజనాతిసక్తమతి సాధుజనాదరణుండటంచును
ర్వర నుతిఁదిర్మలక్షితిపవారిజమిత్రుఁడుగాంచె నెంతయున్. 393

సీ. కట్టించె నేరాజు గగనంబునొఱయ విరూపాక్షుప్రాగ్ద్వారగోపురంబుఁ
బెట్టించె నేన్నృపభిదురపాణి హృద్యమృష్టాన్నసత్త్రంబునీశుఁగూర్చి
చేయించె నేపుణ్యశీలుండు ద్విజులకు నొడుగులు పెండిండ్లు కడు ముదమునఁ
గావించె నేమహీకాంతుఁడు ముప్పొద్దు పంపాధిపతికి సపర్య భక్తిఁ
తే. దలఁచు నేధన్యుఁడాత్మనుదనకుఁగలుగు, మానితైశ్వర్యమీశ్వరాధీనమనుచు
నతఁడు మనుజేంద్రమాత్రుఁడె యధిపమౌళి, రాయలాధిపుతిరుమలరాయమౌళి.

ఆ. ఆర్వీటితిరుమలాధీశ్వరుఁడు రామ, భద్రకథ లఘుద్విపదనొనర్చి

పరమభక్తినాప్రబంధంబు శ్రీవిరూపాక్షుపేరఁజేసెనంకితముగ. 395

సీ. శ్రీరంగనాథుఁగవేరజాతటమున మును ధర్మవర్మప్రార్థననొనర్చి
నిలిపినవైఖరిని మహీధరశ్రేష్ఠమైనకిష్కింధాభిధానదివ్య
నగభేదియై రమానాయకదేహాశ్రమాంబుస్వరూపంబునఘమూర్తి
యగుతుంగభద్రామహానది మధ్యమశ్రీరంగమందిరక్షేత్రమునను

తే. క్రముకముఖభూజముల మల్లికాప్రభృతిల, తాళిఁగలవనమును వేసియాయుపవన
సీమయందును శ్రీరంగధామునునిచె, రాయలార్వీటితిరుమలరాయవిభుఁడు. 396

తే. చెలువు నల్లిండ్లు వనము నికేతనదేవ, భవనసత్క్రతుసుతులనఁబరఁగుసప్త
సంతతులఁగాంచె పరిపను భూజనములు, పొగడనార్వీటితిరుమలభూభుజుండు.

చ. అనదగులీలఁదిగ్గజనృపాదిపుసద్గుణశీలధారుణీ
ధరమునఁబుట్టి సర్వవిబుధప్రణుతుల్సలఁగంగ దేసితా
నరఫణిలోకముల్గులయ నన్యరసన్విహరించి రాజశే
ఖరశిరమానిహించుటనుగాంచెనుగీర్తి సుపుత్రసంతతియుక్. 398

సీ. గంధసింధురజవసైంధవవీరగణంబులు బుధ్వజ్జనంబుగాఁగ
దిగ్గజకర్ణబాధీకరసుభటాట్టహాసముల్వేదమంత్రాళిగాఁగ
దళితాహితాశ్వమత్తగజఘటాలంకృతధరాతలంబు వితర్దిగాఁగఁ
జండతరాటోపమండలపరిపంథిరాజవరులు పశుప్రతతిగాఁగ

తే. భూతభేతాళదేవతాప్రీతిగాఁగఁ, జటులసంగరసవనస్రజంబొనర్చి
వినుతికెక్కెను ధరనునార్వీటితిరుమల, భూమిపాలుప్రతాపాగ్నిసోమయాజి. 399

తే. పటుయశోనిధి చిన్నవేంకటపతీంద్ర, వీరవేంకటపతిరాయవిభుతిరుమల
నృపతి జిల్లెళ్లకొండమహీవరాఘ్య, తనయరైయినట్టికోనేటమ్మను వరించె. 400

క. అనసూయతార్యతాళుచు, లనసూయాశచిసుధాంశునజ్జముఖుల దీ
టన నారవీటితిరుమల, ఘనుకోనేటమ్మ వినుతిఁగాంచె ధరిత్రిన్. 401

సీ. సన్నుతికెక్కినసతతాన్నదానంబు ఛోఁడిమినాయన్నపూర్ణ సాటి
గణుతింపఁదగినట్టికడుఁదాల్మిగోనమున జలరాశిమేఖలాలలన సాటి
సంస్తుతింపఁగఁదగుసర్వలక్షణములఁబాలేటిదొరముద్దుపట్టి సాటి
వినుతికిఁజాలినవిమలమాంగల్యతఁజలిమలఁబోడమినచెలువ సాటి

తే. గాకయితరమహీనాథకామినులను, సాటియనవచ్చునెట్టులార్వీటితిరుమ
లక్షితీశ్వరునర్ధాంగలక్ష్మియనఁగఁ, బరఁగుకోనేటమ్మను బుధవరులసభల. 402

సీ. దుర్జయరాజన్యదోశ్శక్తులుడిగించి సర్వసర్వంసహాచక్రభార
భరణదక్షత మహాప్రౌఢులౌ శ్రీకృష్ణరాయలు నార్వీటిరామరాజ
తిరుమలరాయాదిధరణినాయకులును వారలదేవులు వసుధఁగీర్తిఁ
గనరె యాకీర్తికి జననంబు పోషితకవిజనసన్నుతిగాదె యట్టి
తే. కవిజనాధారవిఖ్యాతిఁగాంచి మిగులఁ, గవులఁబోషించి తిన్నుతి కబ్బములను
తింపవెలసెను నార్వీటితిరుమలక్షు, మాపరేంద్రు కోనేటమ్మ మహిని మిగుల. 403

శా. దీనత్రాణుఁడు తిమ్మరాజమహిభృద్దేవేంద్రుఁడుద్యద్భుజా
నూనస్ఫారబలాహతాహితమహీశోత్సాహుఁడాపోచిరా
డ్భూనాథోత్తమరామరాజతనయ౯ బూతాత్మఁదిర్వెంగళాం
బానారీమణినగ్నిసాక్షిగను జేపట్టెం బ్రమోదాత్ముఁడై. 404

క. ఆమదిరాక్షులు తిమ్మ, క్ష్మామండలపతియు మనిరి సౌఖ్యోన్నతుల౯
శ్రీమేదినులును హరిబలెఁ, బ్రేమలు చిత్తముల మిగులఁబెనఁగొని నిగుడ౯. 405

మ. అమరాహార్యసమానధైర్యుఁడిరవర్యాగ్ర్యుండని సద్వైభవా
నిమిషేంద్రుండగు తిమ్మరాజమణి కోనేటమ్మ శ్రీరంగభూ
రమణు౯ శ్రీచినవేంకటక్షితిపుని౯ రాజద్గుణాంభోనిధిం
బ్రమదంబొప్పఁగఁగాంచి రంతయు బుధవ్రాతంబు కీర్తింపఁగ౯. 406

చ. ఎలమినిఁదిమ్మరాయవసుధేశుసిరంగనృపాలవర్యుఁడు
జ్జ్వలవిజయాతిశౌర్యవరవైభవనిర్జితరూపచండదో
ర్బలమహనీయదానగుణరాజిలికాంతులఁ గేలిసేయునా
బలరిపుపుత్త్రసింహాసురపాలరతీశబలాబ్దచంద్రుల౯. 407

క. కురుకులమణియగు శ్రీరం, గరమావరుయశము దీటుగాఁబూనను దా
సరిగాక డాఁగె శారద, సరసిజభవవదనజలజసదనములందు౯. 408

సీ. పరమవైభవమునఁ బ్రతివచ్చునొక్కింత చక్కఁబేరిటినాఁతిసుతునితాత
విక్రమోదగ్రత వినుతింప సరివచ్చుఁ జుక్కఁబేరిటినాఁతిసుతునితాత
గాంభీర్యగుణమున గణుతింప సరివచ్చుఁ జుక్కఁబేరిటినాఁతిసుతునితాత
యధికబలంబున నరయనుద్దనవచ్చుఁ జుక్కఁబేరిటినాఁతిసుతునితాత
తే. కాకయితరులనెట్లు దీటుగా నుతింప, వచ్చు నార్వీటిపురవంశవర్ధనుండు
విమతగజసింహుఁడగు తిమ్మవిభుతనూజ, చిన్నవేంకటపతిరాయశీతఘృణికి. 409

మ. అనిఁదిమ్మాధిపుచిన్నవేంకటనృపాగ్ర్యత్సూండు గీర్వాణరా
ట్తనయుండంచును మార్కొన౯ వెఱచి యారాతిత్రాణపారీణుఁడై

ఘను సేవించుట యుక్తమంచు రిపుభూకాంతుల్ మదేభాశ్వమం
డనముల్ దెచ్చియొసంగి పెట్టుదురు దండంబుల్ వినీతాత్ములై. 410

మ. ఇలఁదిమ్మప్రభుచిన్నవేంకటధరిత్రీశోరుసత్కీర్తినిన్
గలధౌతాద్రిని నాగిరీంద్రమున నుక్షుం బన్నగాధీశుపైఁ
జెలువొందన్ శివు నాగిరీశుతఁ బైశీతాంశునిన్ గంగనున్
దులలోనిట్లజుఁడుంచి తూఁచ ములుదాఁదోచున్ యశంబున్నెడన్. 411

తే. ఇట్లు సుతియుక్తమిల నుతికెక్కి యనుఁగుఁ, దమ్ముఁడౌతిమ్మభూభర్త నెమ్మిఁగొలువ
రాజకులమణి కోదండరామవిభుఁడు, దనరుఁగర్ణాటరాజ్యపదస్థుఁడగుచు. 412

క. ప్రణుతపరాక్రమతిగ్మకి, రణుఁడార్యనుతుండు సకలరాజమకుటస
న్మణిరంగదంఘ్రిభాసుర, గుణియారామవిభుఁబొగడ గురునకు వశమే. 413

క. వనజాహితకులుఁడగుశ్రీ, చినవేంకటపతినృపాలశేఖరునకుఁదా
మునుగరుణ వచ్చి వచియిం, చినయట్టినగంబొసంగుచిత్తముతోడన్. 414

సీ. జగములు గంపింప సాహసవృత్తిని సనిశక్తై ధర్మవిధ్వంసియగుట
పట్టాభిషేకవిఫలతనొందియు జటివేషియై వనము ప్రవేశమగుట
యపరాధియగువానిననిలోనఁదుంపలేకర్కతనూజుతోడాసపడుట
చెలరేఁగి మదిని వచింపక మిగులఁబుణ్యజనౌఘమంతసంహారియగుట

తే. పరిహారముగాఁగ ధర్మతత్పరత రాజ్య, మేలి యసహాయశూరత నెసఁగి పుణ్య
జనుల రక్షింపఁగోరి దాశరథి వేంక, టాద్రిపేంద్రునిరామాంకుఁడై జనించె. 415

సీ. ఎంతఁజల్పినమానవంతఁజేయుటె కాని యంతలేదనుటయాపంత లేదు
సజ్జనసాంగత్యసరణినుండుటె కాని యితరమహామార్గమొకింత లేదు
ప్రకటసుకృతసంగ్రహబుద్ధియే కాని నీతిదూరంబైనరీతి లేదు
పరధనంబు తృణంబుపగిదిఁగాంచుటె కాని మోమెత్తి చూచుట మొదలె లేదు

తే. దుష్టనిగ్రహమొనరింపఁదొడరుఁగాని, పరుగుణదోషమెన్నుటవలను లేదు
రాముఁబోలినసుగుణాభిరాముఁడైన, వేంకటపతీంద్రురామభూవిభునికరయ. 416

సీ. అలసటచేనైననన్నృతమాటాడఁడాడినమాట శిలాక్షరంబు
మఱచియైననుసన్మార్గవర్తనలేదు ప్రవర్తిల్ల ధర్మప్రవర్తనంబు
కలనైననోరులనులుకతోఁజూడఁడు చూచిన సంతతశుభకరంబు
వలయికలోనైననర్థికీయఁడు కొంచెమిచ్చిన దారిద్ర్యమెల్లఁదొలఁగు

తే. నెప్పటికినైనఁ బ్రజలకల్లెంతయంత, సంతసమెకాని వేరగుచందమొందఁ

డనుచు ధరనభినుతిఁగాంచియలరునార, వీటివేంకటపతిరామవిభుఁడు మిగుల. 417

సీ. సదయప్రవర్తన శౌరిదాఁ బ్రతివచ్చు నరసారథియనంగఁ బరఁగఁడేని
ఘనగుణస్ఫూర్తి సాగరుఁడు దానైనయగు విషధినామంబున వెలయఁడేని
కాంతిని రోహిణీకాంతుండు సరిఁబోలు దోషాకరాఖ్యతోఁ దొడరఁడేని
సర్వజ్ఞతను ద్రిలోచనుఁడు చూడఁగనొప్పుఁ దామసగుణముఁ దాఁ దాల్పఁడేని
గీ. యితనికనుచును బుధతతుల్ నుతియొనర్పఁ, దనరు నెంతయు లోకైకధన్యుఁడఖిల
వసుమతీభారభరణనిర్వాహకుండు, వేంకటపతీంద్రు రామపృథ్వీవరుండు. 418

మ. వనజాదిప్రసవాశుగంబులు శుకాశ్వంబిక్షుచాపంబు మీ
ననవోదగ్రపతాక డాఁచి ధరకున్ రాఁబోవు లక్ష్మీసుతుం
డని భావింతురు నెమ్మనమ్ములను మోదాభ్రాంతిచే భామినుల్
ఘను రామక్షితిపాధ్యు నార్తజనరక్షాదక్షు నెల్లప్పుడున్. 419

లయగ్రాహి.

దిక్కుల జయించుమది నెక్కుడుగ రామపతి పెక్కగుబలంబులిరుచక్కిఁ గొలువంగా
నొక్కపయనంబు సననిక్కడికి రాఁదలఁచు నిక్కమిది వార్తతని కెక్కుడగు శూరుం
డొక్కరుఁడు గల్గఁడిల నెక్కడి విచారములు మ్రొక్కి కొలువన్ వలెను స్రుక్కి వనసీమన్
ద్రొక్కవలెఁ గాలగతులక్కరణి వచ్చుహరి దిక్కనుచు వీరములు దక్కుదురువైరుల్.

సీ. ఘనఘనాఘనసముత్కరగళితాశనిఘోషఘోరరవముల బెట్టు గెలిచి
ప్రళయకాలోగ్రభైరవకరఘంటికాఘణఘణాధ్వనులమున్గడు హసించి
సృఘనన్మహార్యపక్షవిభిన్నోన్నతస్తంభపటుపటాత్కృతులను బరిహసించి
ఘోరహేమాక్షవిదారణోద్ధతకిటిఘుటఘుటస్వనములఁ గొంచెపఱచి
తే. ధరను వెలసెను రిపునృపధవళధూళి, కాయములగర్భనిర్భేదక్రమవిహార
గౌరవంబారయ్యలెంచంగఁ గాంచి రామ, ధారుణీనాథుభూరిభేరీరవంబు. 421

చ. పరధరణీశరాజ్యముల బల్విడి రామనృపాలుసేన స
త్వరమున నాక్రమింపఁ జనఁ దత్పదరేణువు దిక్కులందునం
బరమున నిండఁబొల్పెసఁగె భాస్కరుఁడుం బగలింటిదీపమై
యరయఁగ ధూళిధూసరితమయ్యె నభశ్చరకుంతలాగ్రముల్. 422

శా. ఉత్సారోహణుఁడై దిగంబరుఁడునై యుగ్రాంశుఁడై సొల్పుఁగా
శ్రీక్షేత్రంబునఁ బోవువాఁడు చటులాజిన్ రామభూపాలకా
ధ్వస్తత్రున్ మార్కొని తత్కరాసినిహతుండైనట్టివాఁ డాసహా

స్రాక్షేఖేంద్రము నెక్కి శుభ్రగసముండై దివ్యుఁడౌఁజూడఁగన్. 423

మ. కనఁగాఁజిత్రముగాఁగఁజేయు రణరంగక్షోణియందున్న శ
త్రునృపాలావళియర్కమండలముఁదోదోపాడుచున్ దాటి వే
చని రంభాదినిలింపవామనయనాసంఘంబుతో నెప్పుడున్
ఘనదాంపత్యమునొంద రామమహిపక్ష్మాక్షిత్యాబ్జజుండెంతయున్. 424

ఉ. శ్రీకరమూర్తి రామనృపశేఖరుఁడాజి విరోధిభూవరా
నీకముఁద్రుంచుఁదన్మకుటనిర్గతరత్నములు ప్రవాహినుల్
వే కొనిపోయి నింపఁబ్రకటింపఁగఁబంబడిరెమిం బయోధి ర
త్నాకరమంచుఁగాక కలవా మును వార్ధియందు రత్నముల్. 425

మ. అనిలో రామనృపాలుచేఁబడి శత్రుత్యామాత్యశుండాలవా
హనపుత్రాప్తులపంగఁగాంచి హతశేషాంతఃపురంబు భీ
తిని వింధ్యాదిమహీధరంబులను నెంతే డాఁగి గ్రావాగ్రమై
వనితాయుక్తముగా వసేపములలో ప్తృంబు నాకీతుల్. 426

శా. వీక్షింపంబడె రామభూవిభుఁడు గోస్వర్యంబుచే మించి జ
న్యక్షోణిన్ రిపుకోటులంగునుమనత్యంతంబు తెప్పింకజా
తాక్షుల్ దీనతరార్తులై కురియుబాష్పాంబుప్రవాహంబు ప్ర
త్యక్షప్రక్రియనాక్రమించి మరుదేశాంతంబులన్ మించుటల్. 427

ఉ. తామసులై బలాబలముఁదాముదలంపకయున్న నిర్వసం
గ్రామముఁజేసియోడి రిపురాజులు పుట్టలు నెట్టులెక్క శ్రీ
రామనిజాంశసంజనిత రామమహీమహితకీర్తి సే
వా ముముఁగావవేయునిన వారలు సత్కవిస్తోత్రము నవ్వుచున్. 428

ఉ. రాముని హైహయుం బరశురాముని హైమనతీసుమారు సు
త్రామతనూజుఁబోలినపరాక్రమమున్న నమందరంబుచే
రామవిభుండు శత్రుజలరాశి మథించుచు వేడ్కఁగాంచెద
త్నామజఘోటకప్రముఖసంపదలెల్ల సుకేంద్రుశైఖరిన్. 429

## విజయసీసమాలిక.

శ్రీమన్మహాసుధాధామవంశంబుర్వి వినుతికెక్కఁగనుద్భవించినట్టి
రఘురామమూర్తియౌరామరాజక్షమాపాలుండు జాటూరిబైట మున్ను
ఖండనభూమినిఁబన్నినంగతురబారికి నదచినిహారశౌర్య

గరిమచేఁ గరులను హరులఁ బదాతులఁ బోరిఁ గొని జయలక్ష్మిఁ బొందెనట్టు
లాసనమును పేరనమరినపురియొద్ద మైసూరివారటు మాఱుకొనను
గణుతికెక్కినగంధసింధురతురంగమవీరభటనికాయములు పెక్కు
గలదళముల వారిదళవాయిలైనకుమారయ్య చనుదెంచి పోరఁ దీర్పఁ
గని కరిఘటఁ గన్నకంఠీరవేంద్రునికైవడి మిగుల దుర్గర్వమెసఁగ
మేటిలైన కాసరకోటతిమ్మయ సబినీసుకృష్ణయ కార్యనిపుణుఁడైన
పట్టివేంకటపతిత్మాపాలుఁ డాదిగాఁ గలదొరల్ చతురంగబలముతోడ
నిరుగడ వెనుక ముందఱఁ ద్రొక్కి నడవంగ ధరణీవరాహపతాక మెఱయ
బలరజంబంబుదపథసురకామినీబృందధమ్మిల్లంబులందు నిండఁ
బలుమాఱు దెచ్చుచుఁ గంపహాళనుఁడు నాట్యమెలమితో నాడుచునిట్టిరణముఁ
గానవేడుక మున గౌరవపాండవుల్ పెనఁగిరీరీతిని వినుతిచేయ
ఖడ్గమరీచులాకసము దిక్కులఁ గప్ప సుబహితబంధుసంతతులతోడఁ
గరులకుఁ గరులును హరులకు హరులును గాల్బలంబునకును గాల్బలంబు
దలపడి పోర శాత్రవసేనలుఁ గుప్పడించినప్పుడుగని నిజసేనఁ జెదర
నియ్యక పురికోప్ప ప్రత్యర్థులు గానని మొనఁ జొచ్చి చించుచు మూలలుగను
జొరఁ బారి మఱియును జుట్టువాగక విశ్వరూపుఁ బూనినశౌరిరూపుమాడ్కి
నరులకందఱకును నన్నిరూపంబులనక్కడక్కడ మొనకాని నిలిచి
పాలిపోలిక లయకాలునికైవడి మారిమసఁగురీతి మాఱులేక
రెంపవపాఘఁ డీతంపననపీలఁ గంగుక క్రీడగాఁ గంధరములు
ధర డొల్లఁ బదములు కరములంబును బ్రక్కడొక్కనియే ఱుపఱుపరాక
వండమువఱగినట్లుండ గాత్రంబులఖండముల్ కుప్పలుగాఁ గనూల
విదళితద్విపమును వినిహతహయమును నిపాతితవీరపదాతియును వి
ఖండితవాహవేదండచయారోహకంధరంబును వికలితపాద
కర్ణనాసోష్ఠమస్తకంఠకరంబు విభ్రష్టకేయూరహారమును భూష
ణంబు విశ్రుతసింహనాదంబును విదార్యమాతంగదాసితోమరరథాంగ
పరశుపట్టసశూలపరిఘంబు వినిహతిచామరకేతనచ్ఛత్రమును వి
లీయమానతురగాళిఖురసముద్ధూతవిపులపాంసుంబు విరహితానవ
కారానకరటిఘీంకారఘంటాఘణత్కారభూషణఝణత్కారతురగ
కింకిణీనూపురక్రేంకారవీరభటానోక్త్యన్యధిక్కారమాజిభూమి
యగునట్లుగాను మహాస్రప్రవాహముల్ ధాత్రియుతంబుగా సాఁగి పాఱ
శాకినీప్రముఖపిశాచజంబుకకంకవాయసంబులకుఁ దనివారఁ బెద్ద

పబ్బంబుగా వీరభటసామజాశ్వాళిఁ బోరిఁ గొని హరులనుగరులఁ బట్టి
శరణన్న నృపతులఁ గరుణతోఁ గాచుచుఁ బలువడిఁ గొందఱఁ బట్టి విడిచి
కాందిశీకత నలుగడలకుఁ బాఱిన వెంటనంటక మళ్లివిడుపట్టుఁ
జూఱగాఁ గొని జయభేరులు మ్రోయంగ సైన్యంబు లుభయపార్శ్వములఁ గొలువ
నిజశిబిరంబున నిండువేడుకఁ దలఁపూవు వాడక సుఖంబున వసించి
క్షితిసురాగ్ర్యులాశీర్వాదమొనరింపఁ బ్రమదలు నీరాజనములొసంగ
రామ రాజకులాబ్ధిరాకాసుధాకర రాజాధిరాజ వీరప్రతాప
రాజమార్తాండ సుత్రామసన్నిభ యష్టదిగ్రాజభయదార్క తేజ రాజ
పరమేశ యనుచును భటకవిగాయకుల్ వినుతింప నసదృశవిజయగమన

తే. బొందెఁ గడు శ్రీవిరూపాక్షుభూరికరుణఁ, స్థిరముగా నెంతయును దనుఁ జేరినార
వీటిపురవంశమణి యార్యవినుతచరితుఁ, డైన కోదండరామరాయనరవరుఁడు. 430

సీ. ఎల్లప్పుడు మగనులెట్టగాఁ జేసుక పడి మోరతోఁ బ్రనుగుడు లెగయును
గనుఁ గొనుచూరక తనపుఁ దానడఁకుచు బుడిబుడి కడుపుల ముడుచు మొగము
మదవృత్తి మేననుగదుఁ మూఁగుచు బయల్ సారెసారెకును జేబొరలిడును
గాలావటించు నేవేళ నుజూచిన బుసకొట్టుచుం బంట విసపుఁ బెట్టు

తే. ననుచు భూదారకూర్మనాగాహివరులుఁ, బరిహసించుచు ధారుణీసరసిజాక్షి
భామినీలోకనూతనపంచబాణు, రామరాజేంద్రుని మూఁపు రహి వహించె. 431

సీ. ఘనమదోద్ధతవృత్తి కరిశాబకములందు గతివిభ్రమము రథాంగములయందు
పరపీడనము వీరభటసంకులములందు త్వరితలాఘవము సైంధవములందు
ధర్మవిధ్వంసంబు దారుణాహవమందు ఖరకరత్వము సాయకములయందు
భీషణారావంబు భేరీభాంకృతులందు యతిచంచలత మండలాగ్రమందు

తే. కాని తనయందుఁ బ్రజయందుఁ గానఁబడక, యుండ నేలెను ధారుణీమండలంబు
శౌర్యమున నాదిరాజన్యచర్య మెఱసి, రాజకులభూషణుఁడు రామరాజవిభుఁడు.

మ. కుముదాప్తాన్వయభూషు రామవిభునిం గొల్వంగ నశ్రాంతముం
గములై వచ్చి నిజాంకనుద్ధతపతాకల్ చాల శోభిల్లఁగా
శ్రీములుల్ జొట్టును డిగ్గి కాన్కలిడి పాలింపుం డిలం జేయువారం
బ్రమదం బందఁగఁ జేయుచుండుదురు సర్వక్షోణిపాలాగ్రణుల్. 433

క. అనవరతకృతాధ్వరములఁ, దనిమిషులకు మిగుల మోదమొనరించుచుఁ గాం
చెను భూజనులెంచఁగ వరుసను రామవిభుండు సప్తసంతానంబుల్. 434

క. క్షేమ మడిగిన నన్నిటి నంతయు నదిరామనరవరాగ్రణి యొసఁగుఁ గ్

సంతతవితరణరేఖా, చింతామణియనుచు బుధులు క్షితి నుతిచేయన్. 435

మ. అలరన్ రామవిభుండు శిక్షితముసై యార్యప్రజస్తుత్యమై
వెలయన్నేర్చినపూర్వధర్మవిలసద్విద్యావిశేషంబును
జ్వలమైనట్టిగుణంబు నల్దెసలనున్ వ్యాకీర్ణమై మార్గణా
వళులెల్లప్పుడు సన్నిధిన్ మిగులనున్ వర్తిల్లఁ జిత్రంబుగన్. 436

మ. ఘనకర్ణాదులఁబోలు రామధరణీకాంతేశు నౌదార్యమున్
గని మేరుస్ఫారసువర్ణభూధరములన్ గాపుంచికోశంబులన్
దనరన్నెమ్మది దేవతల్విబుధవిత్తప్రేమలేదిమ్మహా
త్మునకిట్లున్నను వీనిసేఁపని సురస్తోమంబు మోదంబునన్. 437

మ. జనపాలాయిదియేమి కల్పకము లేవన్ భూమిపై రాల్చెఁ గ్రొ
న్ననలన్నన్ వినుమోసఖీ ధరణీనాథాద్యుఁడౌ రామరా
జనిశంబర్థులకర్థిసర్థ మిడు మిత్రాత్మోద్భవున్ మీఱియం
చును జెప్పన్ దలయూఁచి మెచ్చుచునటంచున్ వెల్ప వాఁడంగ్రితోన్. 438

చ. తిరముగ నిలిశోఁకఁగఁగఁటిఁదీర్పనిరాముఁడు కింశసీమనున్
గరళిమలేనిశంకరుఁడు కందదఁజెందనిశీతభానుఁడున్
సరియగుఁగాకయున్నసటు సాటగునంచు జనంబులెంచఁగాఁ
బరఁగు ధరిత్రి రామనరపాలునికీర్తి మనోజ్ఞమూర్తియై. 439

సీ. ఘోరవిరోధిధరారమణౌఘనోర్గర్వంబు కారంబుఁగిడక మాన్పి
దుష్టాహితేశవధూసంఘమానసేందీవరోల్లాసంబుఁ బోవఁద్రోచి
దర్పితాజేయశాత్రవపాలయామినీరాజమండలము సంభ్రమమణంచి
పరిపంథిమానవవరచాయమై నిజప్రాలేయపటలంబుఁ బాఱఁదోలి
తే. హితవయోరుహములకునింపెసఁగఁజేసి, భజనస్తుతి సెలఁగనల్దెసలు వెలుఁగ
ధరణిఁగోదండరామరాడ్ధరణిపాల, విపనిభూరిప్రతాపభాస్కరుఁడు చెలఁగు.

సీ. జిగివెండిసరగంచుచెంగావిచలువని కాంక్షింతు గంతయుఁగట్టుకొనఁగ
శ్రీగంధమిళితకాశ్మీరపంకంబని తలపోయుదురు మేననలఁదుకొనఁగ
జాజ్వల్యమైయైనసంపంగిదండని చూతురు కొప్పునఁజుట్టుకొనఁగ
ఘనహారపద్మరాగయుతభూషణమని ప్రీతిఁబొందుసురాత్మ బెట్టుకొనఁగ
తే. భ్రమసి తిరుగుదురట్టుల దిగ్భ్రమలెప్పుడును జతుర్దిశశృంగారమునుఘటింపఁ
గమలజాండంబునిండి చెల్వలరురామ, విభునికీర్తిప్రతాపములు వెలయుచుండ. 441

శా. కారుణ్యాంబుధి పోచిరాట్కులసుధాకిరణ్ధీశుఁడర్థార్థి మం
దారుండై విలసిల్లుకృష్ణమనుజాధ్యక్షేందుసత్పుత్రి నాం
చారమ్మన్ వరియించె రామధరణీశస్వామి మోదంబునన్
క్షీరాంభోనిధికన్యనచ్యుతుఁడు మున్ జేపట్టినట్లుంబలెన్. 442

తే. రాజమణియాజిలల్లితిర్మాళరాజు, తనయ వెంకమదేవిను ద్వాహమయ్యె
నారవీటిరామభూపాలకాగ్రగణ్యుఁ, డఖిలబాంధవనికరంబులభినుతింప. 443

ఉ. సూరపసంగ్రవర్ధనుఁడు సూరిజనావనుఁడైనయోబధా
త్రీరమణీశునాత్మజ సుధీనుతనుగ్గమదేవినిన్ మహో
దారుఁడు రామరాజహిమధాముఁడు వేడ్కను బెండ్లియయ్యెనా
గౌరిని మోదమొప్పఁ గిరకంధరుఁడున్ వరియించుభంగిగన్. 444

మ. కురువంశాగ్రణిరాయలాధిపుని శ్రీకోదండరామాఖ్యభూ
వరుఁడంభోజహితాన్వయాబ్ధిశశి శశ్వత్కీర్తియౌపోచిరా
ట్ధరణీపాలునియచ్చిరాజుతనయన్ ధన్యన్విశాలాలకన్
హరిణాంకాస్యను రాగమొందఁగను వివాహంబయ్యె మోదంబునన్. 445

ఉ. సంగరరంగభార్గవుఁడు సాధుజనావనుఁడౌడిలల్లితి
ర్వెంగళనాథరాట్సుతను విశ్రుతసద్గుణశీలవాల సా
రంగధరాస్యనుగ్గమను రామవిభుండు వివాహమయ్యెను
ప్పొంగుచు సర్వబంధుచయమున్ దగునౌనని సన్నుతింపఁగన్. 446

తే. వెండిమునలజిల్లల్లితిర్వెంగళేంద్రు, తనయయైనట్టినాంచారమను వరించె
నారవీటికోదండరామావనీశుఁ, డఖిలబాంధవసందోహమభినుతింప. 447

సీ. కావేరికాల్వలు గాఁ దీర్చి కట్టించి కట్టినాతనిపేరుఁ గలిగి తనదు
కులమొప్పఁ జేసిన జలజాప్తవంశజుఁడగు చోళభూపాలునన్వయాబ్ధి
సోముఁడౌ వరదరాట్క్షోణీశునప్పలమానవాధీశుకుమారికఁ దిరు
వెంగళాంబను నారవీటివంశలలాముఁడౌ రాయలాధీశునగ్రతనయుఁ
తే. డఖిలరాజన్యమస్తకన్యస్తమకుట, మాన్యమణిరాజపాదతామరసుఁ డలఘు
చరితుఁడైనట్టిరామరాజ్ఞనవిభుండు, పరిణయంబయ్యె బాంధవప్రణుతులెసఁగ. 448

ఉ. భూమిని నప్పుడింతయొడఁ బాయనిఛాయయుఁ బోలి రామభూ
జానిమనంబు రాణి మెలఁగి చాల సపర్యలొనర్చి మన్ననన్
మానుగఁ గాంచి బాంధవసమాజముతొంగుపసింపనంగనా

మానవతీచయంబు గుణమండనసన్నుతిఁ గాంచె నెంతయున్ ఖ్యాతిచేయఁగన్. 449

చ. భరతకులప్రదీపుఁ డరిభంజనుఁ డంచితరాజధర్మత
త్పరమతి యారవీటిపురధాముఁడు రామమహీతలాధిపే
శ్వరుఁడు మదిన్ ప్రమోద మొదవన్ గనె నుగ్గమదేవియందు భా
సురసుకుమారునిన్ సుగుణశోభితునిం బెదవేంకటాధిపున్. 450

క. ఘనుఁడగు రామనృపాలుఁడు, కని నాంచారమ్మయందుఁ గడుమోదముతో
దనుజిన వేంకటపతినృప, వనజాహితు రాజవంశవర్ధను ననఘున్. 451

క. పెండియు నాంచారమ్మను, మండితయశుఁడైన రామమనుజేశునకా
ఖండలసన్నిభుఁ డగుకో, దండమహీపాలతుహినధాముఁడు పుట్టెన్. 452

మ. శమితారాతిబలుండు రామమనుజేశస్వామి రాజాస్యరా
గమదేవీమణివల్లిఁ గాంచెను మహాహ్లాదంబుతో ధన్యునిం
బ్రమదానూతనపంచబాణు సుగుణభ్రాజిష్ణుఁ బంచాస్యవి
క్రముఁ బాథోధిగభీరు వేంకటపతిక్ష్మాపాలకాగ్రేసరున్. 453

సీ. సంగీతసాహిత్యసరసవిద్యాప్రౌఢి రాజీవగర్భతనూజు భోజు
ఘనధర్మగుణగణకాంతి నిస్తంద్రతి రావణాంతకుఁడైన రాము సోముఁ
జండతరాటోపసౌందర్యవైఖరి క్ష్మాధరకన్యాకుమారు మారు
సకలభూభరణభుజాబలవిస్ఫూర్తిఁ బవనభుక్కులసార్వభౌము భీముఁ
తే. దెగడి ప్రహసించి యుతికించి ధిక్కరించి, మించి సరిఁబోల్చి ప్రతియయి మేటియగుచుఁ
దనరుఁ గోదండరామభూధవుని పెద్ద, వేంకటోర్వీశ్వరుం డార్యవినుతు లెసఁగ. 454

చ. బలిసదనంబుఁ బాఁదుకొని పన్నగభర్త నిషంగఁ జేసి భూ
తలమున నాక్రమించెను సుధాజలరాశి మథించి నాకమున్
గలయఁగఁ బర్వి కల్పకముఁ గైకొనె నిట్లు జగత్త్రయంబునన్
వెలసెను రామరాజుపెదవేంకటభూపతికీర్తి వేడుకన్. 455

తే. అప్పు డుర్విఁ గోదండరామావనీశు, పెద్దవేంకటనరపతి పెండ్లియయ్యె
నెమిఁ బోచిరాట్చిన వేంకటేశుపుత్త్రిఁ, గోనమాంబను బాంధవకోటి యలర 456

సీ. సతతంబు నతిభక్తిఁ బతిసేవ సేయుచు నతులితసంపద యతిశయిల్ల
నత్తమామలపట్ల ననురక్తి నడచుచుఁ దోడికోడండ్రతోఁ గూడి మెలఁగి
వదినెలు మఱఁదండ్రు ముదమంద నల్లన మఱఁదులఁ దారతమ్యములఁ బ్రోచి
సుతులఁ బ్రీతినిఁ గాంచి హితబంధుబుధదాసదాసీజనంబుల దయను మనిచి

శా. కారుణ్యాంబుధి పోషి మెట్టినిల్లు, పన్నెవాసినిఁ జెలగంగ మన్ననఁగనె
నారవీటివేంకటపతిక్ష్మాధినాథు, కోనమాంబకు సాటి యేమానవతులు. 457

క. రతిమదనుల శచీంద్రుల, గతి సౌఖ్యములర మనిరి కాకోదరరా
ణ్ణుతపెద్దవేంకటాద్రి, క్షితిపతి కోనాంబ విభుఁకీర్తనలెసఁగన్. 458

సీ. హరిరాజహరిరాజహరిరాజులకు సాటి పటుబలాజ్ఞానూనభాసనముల
హరిహయహరిహయహరిహయులకు సరి వితతక్ష్మాసాహసవిభవములను
హరిసుతహరిసుతహరిసుతులకు నెన వినుతజనౌదార్యవిక్రమముల
హరిపౌత్రహరిపౌత్రహరిపౌత్రులకుఁ బ్రతి సద్ధర్మవిజ్ఞానసాహసముల

తే. ననుచు నెవ్వని వినుతింతు రఖిలవిబుధు, లగుచుహిమకరశతకోటియారవీటి
వంశకలశాబ్ధిరాకామృతాంశుఁడతఁడు, పరఁగుఁబెద వేంకటక్ష్మాభర్త యిలను. 459

ఉ. ఆలములోన రామమనుజాధిపు మా పెద వేంకటావనీ
పాలుఁడు శత్రులందు నమఁ బల్వురఁ దద్రుధిర ప్రవాహముల్
చాలఁగ వార్ధి నించె నటు చాలునె భార్గవరాముసా
శీలత యెంతగొడ్డయని చేర్చె 460



చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1923.